ఆగస్టు, [illegible]

# జయంతి

# 10

సంపుటము 1 సంచిక 10

---

ఈ సంచికలో

మధురాంతకం రాజారాం

రమణారెడ్డి

అనుముల కృష్ణమూర్తి

మోటూరి వేంకటరావు

మిరియాల రామకృష్ణ

చక్రవర్తి రంగస్వామి

కిషన్ పట్నాయక్

కొండముది శ్రీరామచంద్రమూర్తి

సుప్రసన్న

విశ్వనాథ సత్యనారాయణ

ఆధునిక సాహిత్యగతిని సూచించే

హిందీ మాసపత్రిక :

# 'కల్పన'

నవ్య కవితా రీతులు

కథలు

సాహిత్య విమర్శలు

ఆధునిక సాహిత్య సమస్యలపై

విశేష చర్చలు.

కార్యాలయము :

౩౧౬, సుల్తాన్‌బజార్

హైదరాబాద్.

★

**PROCEEDINGS OF THE DIRECTOR OF PUBLIC INSTRUCTION, ANDHRA PRADESH.**

**R. C. No. 973 M 4/58.** **Dated 8—6—59.**

The following Telugu monthly is commended for use in all the Libraries of Schools, Colleges and public Libraries in the State.

Name: JAYANTI

K. RAGHAVA REDDY,
*For Director of Public Instruction.*

★

'జయంతి' రైల్వేస్టేషనులలోని 'హిగిన్‌బాథమ్స్' పుస్తకశాలలలో దొరుకును.

30-7-59

# జయంతి

## 10

జయంతి తే సుకృతినో
రససిద్ధాః కవీశ్వరాః.




సంపాదకమండలి :
విశ్వనాథ సత్యనారాయణ
(అధ్యక్షులు)
మల్లంపల్లి సోమశేఖరశర్మ
దివాకర్ల వేంకటావధాని
జువ్వాడి గౌతమరావు

సంవత్సర చందా 8-0
విడిప్రతి 75 న. పై.

# వేదనా వైభవము

అనుముల కృష్ణమూర్తి

ఒక్క యోగమ్మె సోల్కొల్పి యొకయలిప్త
త ననుసంధించి నిత్యతాదాత్మ్య భావ
లగ్న చేత మ్మనుక్షణోద్విగ్న మయిన
గాని విదితమ్ము గా దహంకారగరిమ.

అనుదినానంత జీవయాత్రావసాన
వేళ బరికించవచ్చు నన్వేష్యమాణ
వస్తు లాభ మ్మ దెందరి భాగ్యములనో ?
బరువు నిట్టూర్పు లెందఱి వశములనో ?

వేలకాలాలపాటు తా పీ లయించు
జగమునందుండు యత్నమున్ జరుపుచుండు
నరునివాసన కెద్ది పునాది ? గతమ ?
వర్తమానమ్మ ? మననమ్ము వలయు సుమ్మి.

తాను గత్యంతరాల దొంతరలబేర్చి
బ్రతుకుతక్కెడ బట్టి లాభమ్ము నరసి
కార్యసాఫల్యమే గోరు గాని నైజ
హృదయపరిధిని వ్యాపింపనీయ దకట!

ఏ యనభ్యస్త కైతవ మ్మిన్ని నాళ్ల
దాసదాసానువర్తిగా జేసె నరుని ?
ఏ కళాపీఠమందేని ఈ పదార్థ
తత్వబోధన నేయు శాస్త్రమ్ములేదు.

శిథిలసౌహార్ద్ర మర్యాద లధమదశల
శుష్క నైమిత్తికస్థాయి సోలిపోవ
తతపరస్పర మానవార్ద్రతయు బోవు
సానుభూతియు బోవు రాక్షసము మిగులు.

పరులని భేదమేని నిజ
బాంధవులం చనురాగమేని సు
స్థిరమతియైన యోగికి
రుచింపవు భౌతిక రక్తిలేమి; తా
నరయును సచ్చిదాత్మకము
నై వెలుగొందెడి నాత్మతత్వమే
పరమమటంచు, దృశ్యమిది
పట్టినమాయ యటంచు ధీరుడై.

# అభిజ్ఞాన శాకుంతలము 10

విశ్వనాథ సత్యనారాయణ

దుష్యంతునియం దంతఃకరణము విత్యజాగ్ర దవస్థాభూతమై యున్నది. ఈ యంతఃకరణము నాల్గు విధములుగా నుండును. అందులో నొకటి మనస్సు. ఋషిశాపమునకు మనస్సు అర్గమగును గాని తక్కిన యంతఃకరణముమీద నా శాపము పని చేయదు. ఆ యంతఃకరణము మేల్కొనియేయున్నది. ఈ శాపబలమున రాజు శకుంతలను మరచిపోయి నాఁడు. ఈ సందిగ్ధమైన వృత్తియే యీ నాటకము నందు రసభంగము కాకుండ దుష్యంతుని శీలభంగము కాకుండ నాటకమునందలి నాటకత్వము చెడి పోకుండ రక్షించుచున్నదని పూర్వము చెప్పఁబడినది. దాని స్వరూపము ప్రపంచింపఁబడును.

ముని శిష్యులు గౌతమియు శకుంతలయు వచ్చిరి. రాజు శకుంతలను జూచెను. తక్కిన వారిని జూచెను. వా రెందుకు వచ్చిరో తెలియదు. మునిశిష్యు లెందుకో వచ్చిరి. గౌతమి ఎందుకు వచ్చినది? ఆ వృద్ధురాలు రావలసిన యవసరములేదే। మఱియు వారి వెంట శకుంతల యున్నది. రాజనుకొన్నచో నీ వృద్ధురా లెందుకు వచ్చినది యని కూడ ననుకొనవలయును. ఆ ప్రసక్తిలేదు. శకుంతలను జూచినాఁడు. ఆమెను గూర్చి యనుకొన్నాఁడు. ఈమె యెవరు, ఈమె యెందుకు వచ్చినది, అని సామాన్యముగా నను కొన్నచో సంగతమయిన మాటయే యగును. అట్లను కొనలేదు. ఇట్లనుకొనెను. 'అథాత్ర భవతీ. కాస్వి దవకుంఠనవతీ నాతిపరిస్ఫుట శరీర లావణ్యా మధ్యే తపోధనానాం కిసలయమివ పాండు పత్రాణామ్.' 'మఱి యీ పూజ్యురాలు పాండు పత్రముల మధ్య కిసలయమువలెఁ దపోధనులమధ్య నాతిపరిస్ఫుట శరీరలావణ్యయై యవకుంఠనవతియైన దెవ్వరు?' (నిజముగా నీపద్యము 'అత్రభవతీ'తోఁ గలిపి తెమఁగు చేయుట సాధ్యముకాదు.) ఇదియొక విచిత్రమయిన శ్లోకము. ఈ శ్లోకము నందలి భిన్న భాగముల నొక దానితో నొకటి సమన్వయపఱచుట క్లేశ మని పించును. ఆమె శరీరలావణ్యము అతి పరిస్ఫుటముగా లేదు. కారణమేమిటి? అవకుంఠనవతియగుటచేతనా? తపోధనులమధ్య నుండుటచేతనా? ఏలయనఁగాఁ బండుటాకుల నడుమ నున్న చిగురుటాకు కని పించును, గనిపించదు. ఆ చివురాకుయొక్క సొగసు పరిస్ఫుటముగా నుండును, పరిస్ఫుటముగా నుండదు. పైగా నా శరీరలావణ్యము నాతిపరిస్ఫు టము. పరిస్ఫుటమగుచునే యున్నది. అతిపరిస్ఫుట మగుటలేదు. అంతఃకరణమునం దామె స్థితి పరి స్ఫుటముగానేయున్నది. మనస్సునకుఁ దగులుటలేదు. అందుచేత నాతిపరిస్ఫుటము. ఆమె యవకుంఠన వతి. సహజమే. తా నీ యవకుంఠనము లక్షణతః శాపముచేతఁ గలిగిన మనస్సుయొక్క క్రమ్మిక కూడను. ఈమె తపోధనులమధ్యనున్నది. ఆమె తపోధనురాలుకాదు. వారియందుఁ గోరికలు నశించి యున్నవి. వాంఛ లస్తమించినవి. ఈమె యందట్లు కాదు; అందుచేత వారు పండుటాకులు. ఈమె చివు రాకు; వారికిఁ గర్మ పరిపాకమయినది. ఈమెకుఁ గాలేదు. ఈమెకుఁ గర్మ పరిపాకముకాలేదు కనుక నీమె కెదో యాపద రాఁబోవుచున్నదా। తా నీమెను బరిత్యజింపఁ బోవుటచేత నామెకుఁ గలుగఁబోవు దుఃఖము దీనియందు సూచితమగుచున్నదా.

ఇది యంతయు నటులుంచి సామాన్యముగా నీమె యెవ్వరన్న ప్రశ్నపోయి యామె లావణ్యవతి యన్న విషయము తన కెందుకు? ఆమె యవ్యక్త

సౌందర్యమును వర్ణింపవలసిన స్థితి తనకేమిపట్టినది? అథాఽత్రభవతీ. ఇచ్చట 'అథ' యన్న యవ్యయమున్నది. 'మంగళానంతరారంభప్రశ్నకార్త్స్న్యేష్వథో అథ'; ఈ అథ' యన్న యవ్యయము మంగళార్థమునందుఁ, దరువాత నన్న యర్థమందుఁ, బ్రారంభించుట యను నర్థమునందుఁ, బ్రశ్న యందు, సమస్తమునను నర్థము నందు వచ్చును. ఇచట ననంతరార్థము పట్టదు. దేనితరువాత? ఏదియు మొదలుపెట్టఁబడ లేదు కనుకఁ దరువాత లేదు. ఆరంభార్థము మిక్కిలియుఁ బొసఁగదు కాస్విత్ అనియుండుటచేతఁ బ్రశ్నార్థకము గాదు. కార్త్స్న్యార్థము కూడఁ బొసఁగదు. మిగిలినది మంగళార్థము ఇచ్చట నున్న రహస్యమిది. పైకి వాక్యాలంకారమువలె భాసించును. ఆమెయందు రాజుయొక్క యంతఃకరణము ప్రవర్తించు చున్నది. మనస్సుకాదనినచో వచ్చిన నష్టము లేదు. నడుమఁ గొంతకాలమీ వియోగము జరుగునే కాని చివరకు రాజామెను స్వీకరించుట నిస్సంశయముగా జరుగును. ఏతన్మంగళావసానకమైనది యీ 'అథ' యవ్యయము.

ఇనివట్టి శబ్దప్రయోగరసజ్ఞత మాత్రమేకాదు ఏ స్త్రీయందు మానవుని కభిలాష కలుగునో యా స్త్రీయొక్క సౌందర్యమునే మానవుఁడు వర్ణించును. పైగా దుష్యంతునియొక్క శకుంతలాగతమయిన వాంఛ మొదటినుండియు నిట్టి యూహ వైఖరినే యాలంబించినది. 'అర్కస్యోపరిపతితం చ్యుతమివ నవమాలికా కుసుమమ్' మొదలయిన యూహాసామగ్రి దుష్యంతుని వాంఛాప్రకటన లక్షణమయియున్నది. ఆయనమనస్సు చొచ్చినచోట నతని యూహ యట్లే యుండును. అందుచేత నిచట శకుంతలాగతాభిలాషము సువ్యక్తము. మనమాయన నెఱుగుదుము. ఆయనకోరిక యట్లే యుండును. లోకమునగూడ "ఎవరురా యీ యమ్మాయి, ఇంత యందముగా నున్నది" యన్నమాటలో హృదయగతాభిలాషా లేశము లేకపోలేదు.

రాజుపొందిన యీయభిలాష యభిలాషకాదు. వట్టిప్రశ్న యనుకొందమా యనుకొనుటకు వీలు లేదు. రాజామె యందభిలాష పొందుచున్నాఁడని ప్రతీహారిగ్రహించినాఁడు. అతఁడన్నాఁడుగదా "దేవ! కుతూహలగర్భోమేతర్కః ప్రసీదతి దర్శనీయా పునరస్యా ఆకృతిర్లక్ష్యతే" కుతూహల గర్భమయిన నాతర్కము ప్రసన్నమగుచున్నది. ఈమెయొక్క యాకృతి దర్శనీయముగా నున్నది. అనఁగా స్పృహణీయముగానున్నది యని యర్థము. దర్శనీయమనగా స్పృహణీయము; వాంఛనీయము. వ్యాఖ్యలోగూడ నిట్లే యున్నది.

ఈనాటకమునఁ బలుచోట్ల స్థూలముగాఁ జూచినచో నర్థములు పొసఁగింపఁబడవు. నాయొక్క కుతూహల గర్భమయిన తర్కము ప్రసన్నమగుచున్నది అన్న దానికిని యీమెయొక్క యాకృతి దర్శనీయముగా నున్నది యన్నమాటకు నేమి సంబంధము? వ్యాఖ్యాత యతని తర్కముయొక్క కుతూహల గర్భత్వమునకుఁ గారణముగా నిట్లు వ్రాసినాఁడు. అరణ్యమునందుఁ బరిమితాహారములచేత గ్లిష్టమయిన తపస్వులకు నిట్టి రూపలావణ్యాదిలక్షణములు కలిగిన స్త్రీతోఁ గలసివచ్చుట యాశ్చర్యము- అని వ్యాఖ్యానము వ్రాసెను. ఇది యతని తర్కము. ఈతర్కము ప్రసన్నమగుచున్నది. ప్రసన్న మగుచున్నదనఁగాఁ గలుగుచున్నదని కాదుగదా యర్థము. దానియందుఁ బొసఁగుదల కనిపించుచున్నదని యర్థము. ఆపొసగుదల యెట్టిది? రాజామెయందుఁ బ్రేమైకదృష్టితోఁ జూచుచుండుట పొసగుదలయగునా? ఆ పొసఁగుదల యెట్టిదనగా నామె నిస్సంశయముగా స్పృహణీయురాలగు నన్న విషయమునందలిది కాని యతని తర్క విషయముకాదు.

అపుడు రాజిట్లన్నాఁడు. 'భవతు. అనిర్వర్ణ్యమ్ పరకళత్రమ్' ఇందుచేత రాజునకామెయం దభిలాష కలిగినదని దానిని మనసా పరిహరించుటకుఁ బ్రయత్నించుచున్నాఁడని విస్పష్టమగుచున్నది.

ఇచ్చట నొక ప్రశ్న. తొలుత శకుంతలాదర్శన సమయమునఁ దన మనస్సు శకుంతలమీఁదఁ బ్రసరింపఁగా నయోగ్యమైనచోటఁ దన మనస్సు ప్రసరింపదని 'యసంశయం క్షత్రపరిగ్రహక్షమా' మొదలయిన శ్లోకముచేతఁ దన్నుఁ దానసమర్థించుకొన్నాఁడు. ఆ యాపత్తి యిచ్చటనుఁ గలదు. పరకళత్రమని యిప్పుడు పరిహరించుకొనవచ్చునుకాని సహజముగానే యార్యమయిన యాతని యంతఃకరణప్రవృత్తి పరకళత్రముమీఁదికిఁ బోదుకదా. ఇప్పుడు శకుంతల మీఁద నా బుద్ధి ప్రసరించుట తనకేకాదు ప్రతీహారికిఁ గూడఁ దెలిసినదికదా. ఆయన యేమాలోచింపవలయును? నాయంతఃకరణ మీమె సౌందర్యము మీఁది కిప్పుడే పోయినది. నామనస్సులోఁ గొంతభాగ మీమెయొక్క సౌందర్యము నెందులకు వర్జించినది యని చర్చచేసికొనవలయును. కాని శాపపరిచ్ఛన్నమయిన మనస్సున కాశక్తి పోయినది. ఈరీతిగా నతని యంతఃకరణము మేల్కొనియున్నది. మనస్సు పిహితమైనది.

దుష్యంతుఁడు శకుంతలాగతాభిలాషాతిశయవంతుఁడు. రసము చావలేదు. శృంగారరసము జీవంతముగా నున్నది. అతని యంతఃకరణము మేల్కొనియే యున్నది.

ఇట్టి క్లిష్టమయిన ద్విధాభూతమయిన తన యాంతరలక్షణమునందు రాజువ్యగ్రుఁడై యున్నాడు. పురోహితుఁడు 'దేవ! ఈ తపస్వులు విధిప్రకారమర్చితులయినారు. వారి యుపాధ్యాయులు పంపించిన సందేశమేదియో కలదట. తమరు వినవలయును.' అనగా రాజు 'అవహితోఽస్మి' యన్నాడు నే నవహితుఁడనయి యున్నాను. ఈమాటకు సామాన్యార్థమేమనఁగాఁ జెప్పుమనుము విందునని, నేను వినుటకు సిద్ధముగా శ్రద్ధావంతుఁడనయి యున్నాను. కాని ఈమాట వెనుక, దత్పూర్వము పొందిన కలవరమునుండి తేఱుకొని యున్నాననికూడ నర్థము. దానిని గురించి విచారించుట కిప్పుడు వ్యవధి లేదు. కాని తప్పకుండ వారియందలి గౌరవముచేత దానిని వదలిపెట్టి దీనియందు వ్యగ్రుఁడనయి యున్నానని యర్థము. ఈ యర్థమంతయు మనస్సులోని పొరలు, వాని మెలికలు, లోన వేయి మెలిక లుండఁగా నొక ప్రధాన విషయమందు తత్కాల వ్యగ్రత కాంచు మనో లక్షణము భావించిన వారికేఁ దెలియును.

ఇచ్చటినుండి కాళిదాసు ప్రసంగము చాల జమత్కారముగా నడపినాఁడు. రాజుయొక్క మనస్సు నిద్రపోవుచున్నది. ప్రమాదము పొందియున్నది. ఒకఁడు పొరపాటు పడినాఁడు. వాని పొరపాటును సుకుమారములయిన వాక్యములచేత లాలనచేత నభ్యర్థనచేత నది పొరపాటని నిరూపించుటకు యత్నించినచో వాఁడది పొరపాటని యొప్పుకొనినచో నొప్పుకొనును. వానిని నిందించినచో వానిమీఁద దార్ఢ్యము నెఱపినచో వాఁడు మఱియును బిగియును. తనది పొరపాటని యంతరాంతరమున ననుకొనుచున్నను బైకి నసేమిరాయని యొప్పుకొననే యొప్పుకొనఁడు. ఇది లోకమునందలి మానవలక్షణము. తాను శకుంతలను బెండ్లిచేసికొన్న వృత్తాంతము వాని యంతఃకరణములో, నర్ధార్ధముగా నుండి రాజు పొరపడి. తాను పొరపాటు పడితినని శాపవశమున గట్టిగాఁ దెలియని విషయములో శార్ఙ్గరవశారద్వతులు ధిక్కారోపన్యాసములచేత వ్యవహరించఁగా శాపముచేత రాజుమనస్సులోఁ గలిగిన ముడి మఱియు బిగిసినది. ఇది కాళిదాసునియొక్క మానసహృదయ రహస్య పరిజ్ఞానసంజనిత రచనాశిల్పముయొక్క లక్షణము. దుర్వాసుఁడు ఋషి. వీరు ఋషులు. శార్ఙ్గరవుఁ డేమియుఁ దక్కువవాఁడు కాఁడుగదా. ఆయన తక్కువవాఁడు కాఁడని దుష్యంతుఁడే గ్రహించెనే. 'తత స్సిస్త్రైత్యచ్చైర్వదతి గురుశిష్యే గురుసమే' యని శార్ఙ్గరవునిగూర్చి దుష్యంతుఁడే యనినాఁడు. ఆశార్ఙ్గరవుఁడు గురుసముఁడఁట. ఆయన కణ్వునంతవాఁడు. అతఁడెంతవాఁడు? తమ వెంటవచ్చుచున్న శకుంతలను 'ఓసీ! దోషములను మాత్రము తెలిసికొనగలదానవు! ఏమి స్వాతంత్ర్య మవలంబించుచున్నావు' అని శకుంతల ననఁగలిగినంతవాఁడు. ఆమె యాశ్రమమునుండు

దఁగాఁ బల్లెత్తి యొకమాట యనగలిగెనా? ఆమె కణ్వునకుఁ బరమప్రియదుహిత. తమకు గౌరవనీయురాలు. కావి సమయము వచ్చినప్పుడు తానట్లనఁ గలిగిన యధికారము శార్ఙ్గరవున కాశ్రమమున గలదు. ఇంత వ్రాయుట యెందులకనగా నాదుర్వాసుఁడును ఋషియే. ఈశార్ఙ్గరవుఁడును ఋషియే. ఋషులనఁగా నేమి? వారికిఁగల యైహికసంబంధములు కించిత్కరములు. వారి యాత్మలు వారికిఁ దెలియకుండ వారి మాటలువారికి దెలియకుండ దైవము ననుసరించును. రాజుకొలువులో రాజుతోమాటాడుచు వారు స్వీకరించిన వాక్యోపన్యాసవైఖరి పైకి లోకవృత్తమువలెనుండును. పైకి ధర్మాంగజనితకోపలక్షణముగా నుండును. పైకి వారు పట్టణనాగరకత నేవగించి కొన్నట్లు కనిపించును.

కావి పైన జెప్పిన నిగూఢమయిన మానవుని యీ మనస్సుపడిన పొరపాటు తీవ్రవాక్యముల చేతఁ దన్నుదా నంగీకరింపఁజేయుని మానవ స్వభావగత విచిత్రలక్షణమును గాళిదాసుని శిల్పమయినగావచ్చును. దానివెనుకఁగూడ నున్న పరమరహస్యమేమనఁగా వారందఱును ఋషులగుటచేత దైవమెట్లున్నదో యట్లు జరుగుటకే వాంవాక్యముల ధోరణి సహాయపడును. ఇది యీ యంకమునందలి ప్రసంగకల్పనాచాతుర్యమునందలి పరమరహస్యము.

ఈ శిల్పరహస్యము మార్గాంతరోపన్యాసముచేత మఱియు సువ్యక్తమగును. ఆవచ్చిన మునిశిష్యులు శమదమాది సంపత్తికలవారు వారు వచ్చుచునే రాజధాని యందలి పరిస్థితులకు నేవగించుకొన్నారు. "అభ్యక్తమివస్నాతః శుచిరశుచిమివ ప్రబుద్ధ ఇవ సుప్తమ్। బద్ధమివస్వైరగతిః జనఇవసుఖసంగినమవైమి." వారు సమభావముతోఁ జూడలేదు. భేదభావముతోడనే చూచిరి. దానితో రాజుతో విపరీతముగా మాటాడుట జరిగినది. రాజు శకుంతలయందుఁ బ్రసన్నుఁడగుట జరుగలేదు. దానిచేత శకుంతలా ప్రత్యాఖ్యానము మిక్కిలి దుఃఖహేతువైనది. ఇట్లగుట భవిష్యత్తులో జరుగఁబోవు శకుంతలా ప్రత్యభిజ్ఞాన జనితమైన రాజుయొక్క యనుకంపాదులు తదనంతరమైన వారి సంగమము పరమమధురములయినవి. ఈమునిశిష్యులు సామమార్గము నవలంబించినచో రాజుకూడ సామమార్గమున 'నయ్యా! తమవంటి వారు చెప్పుచుండఁగా నేను గాదనలేను కాని నామనస్సు స్మరించుటలేదు. ఆమె నిచ్చటనుంచి పొండు. నాకు స్మృతికలుగునేమో చూతును. లేదా మీరు మీవెంటఁ దీసికొనిపొండు. నాకు బ్రత్యభిజ్ఞకలిగినచో నేనే యామెను దోడితెత్తును. నన్నీవిషయమున క్షమింపుమని మహర్షితోఁ జెప్పుఁడు. మీరింత గట్టిగాఁ జెప్పుచున్న విషయము నేను మఱచిపోయినదియే యైయుండవలయును. ఇట్టి విషయము నేను మరచిపోవుట జరిగినచో నెట్లు జరిగినదో నాకే తెలియకుండనున్నది. మీరు త్రికాలవేదులు. మీరు చూచి నాకుఁ జెప్పవలసినది' యిట్టి ప్రసంగము రాజు చేసియుండవచ్చును. చేసినచోఁ బ్రత్యాఖ్యానమువలన జరిగిన దుఃఖము సగానికి సగములేదు. ప్రత్యభిజ్ఞానమువలన జరిగిన యనుకంపాదుల వలనఁ గలిగిన సమాశ్వాసములోని రమణీయతలేదు. సంగమమువలనఁ గలిగిన సుఖములో నాధిక్యములేదు. ఇవియన్నియు నట్లుకాక కావ్యమునందున్నట్లు జరుగుటకు ముని శిష్యులనీ పట్టణవాసమునందలి భోగములయందలి వైముఖ్యము వారు రాజును దిరస్కరించి మాటాడుటయు హేతువయినది. ఇది యీ యంకములోఁ గాళిదాసు చేసిన పరమ రసానుకూలమయిన కల్పన.

'ఈమె నీభార్య' మొదలయిన యుపన్యాసము జరుగఁగా రాజునకు నమ్మకము లేకపోగా గౌతమి యామె యవకుంఠనమును దొలఁగించఁగా రాజు శకుంతలను విర్వర్ణించిచూచి తనలోవిట్లనుకొన్నాఁడు.

ఇద ముపనత మేవం రూప మక్లిష్టకాంతి
ప్రథమపరిగృహీతం స్యాన్న వేత్యవ్యవస్యన్।
భ్రమర ఇవ విభాతే కుందమంతస్తుషారం
నచ ఖలు పరిభోక్తుం నైవ శక్నోమి హాతుమ్॥

ఈరీతిగా నుపస్థితమయినది; యింత ప్రశంసింపఁ దగిన సౌందర్యము కలదియైన యీ రూపము ఇది వఱకు నాచేఁగ్రహింపఁబడినదా:లేదాః యని నిశ్చయింప లేకున్నవాడనై ప్రాతఃకాలమునందు వానమంచుగల మొల్లపూవును భ్రమరమువలె ననుభవించుటకుఁగాని వదలిపెట్టుటకుఁగాని శక్తుఁడను గాకున్నాను.

ఈశ్లోకమునందుఁ గూడ శాస్విదపకుంతనవతీ త్యాది శ్లోకమునందుఁ జెప్పబడిన సర్వమయిన వ్యాఖ్యయు ననుసంధితమగును. అగుచుండఁగా నంతకంటె నామెనుజూచినప్పటి వేళయందుఁగంటె నధికముగా రాజుయొక్క యంతఃకరణము ప్రబుద్ధ మగుటకనిపించును. ఆయనయంతఃకరణము ప్రబోధ మిం దధికముగా విస్మృతి మనస్సంబంధి. యంతః కరణశక్తి మనశ్శక్తికన్న నధికమయినది. అమన స్సంతఃకరణములోని యొక భాగము. దానికున్న బలము దీనికుండదు.

మనస్సుయొక్క బలమేమిటి? దానిబల మెచ్చట నుండి వచ్చినది? లోకవృత్తమునుండి వచ్చినది. మనస్సుయొక్క సంపూర్ణమైనబలము లోకమునందలి యనంతములయిన విషయములయొక్క పరిజ్ఞానము చేత లౌకికములైన ధర్మాధర్మ విషయములయొక్క పరిజ్ఞానముచేత వచ్చినది. లౌకికునియందు మనస్సు యొక్క బలమే యెక్కువ పనిచేయును. యోగికి నంతఃకరణ ప్రవృత్తియే యధికముగాఁ బనిచేయును. రాజు పరమలౌకికుఁడు. యోగికాదు. కాని యాయన సత్పురుషుఁడు. సామాన్యులయిన లౌకికులయందు నంతఃకరణము ప్రబుద్ధమయియుండదు.సత్పురుషుల యందు నంతఃకరణము ప్రబుద్ధమైయుండును. యోగులకు సత్పురుషులకు భేదమేమనఁగా యోగు లంతఃకరణమునందుఁ బ్రబుద్ధులయి యుందురు. సత్పురుషులయం దంతఃకరణము ప్రబుద్ధమై యుండును. ఈ సత్పురుషులు యోగులకు లౌకికు లకు నడిమివారు. అంతఃకరణము ప్రబుద్ధమైన సత్పు రుషు లధర్మమునందు సంచరింపరు. ధర్మాధర్మము లను చెప్పునది మనస్సు. దుష్యంతు డీవిధమయిన వ్యూహములోఁ దగుల్కొని యున్నాఁడు. అంతః కరణమిది ప్రథమ పరిగృహీతమని చెప్పుచున్నది, ధర్మాధర్మ విచారణవ్యగ్రమయిన మనస్సు ధర్మనిర్ణ యము చేయలేకుండ నున్నది. లౌకికముగాఁజేసినది. ఇది యధర్మమని చెప్పుచున్నది. ఈ మనస్సుతో గూడియున్న యంతఃకరణము భ్రమరము వంటిది. మనస్సు పనిచేయని యంతఃకరణమునకు భ్రమర లక్షణములేదు. దాని యందు రెండు రేఫములు కలవు. భ్రమణశీల మయినది యన్నమాట నట్లుంచి భ్రమర మన్నను ద్విరేఫమన్నను నొకటే. దానియందు రెండు రేఫములుండుట 'రః పుమాన్ పావకే కామే క్షయే వజ్రే శమే రుతౌ' అని నానార్థరత్నమాల. 'ర' అను నక్షరమునకు నిన్ని యర్థములు కలవు. ఇది యగ్ని యందును మన్మథుని యందును వర్తించును. రెండు రకారములలోని యొక రికారము మన్మథుఁడన్నది తెలియుచునేయున్నదికదా. రమణశీలమయిన మనస్సును జ్యోతీ రూపమయిన యంతఃకరణమును నీ రెంటియొక్క యేకత్రస్థితి భ్రమర శబ్దముచేత సూచితమగుచున్నది. కాళిదాసాశబ్దమునచ్చట నందు కొరకే వినియోగించెను. మఱియు 'విభాతే' యన్న శబ్దమునకు ప్రభాతకాలమునందు నని యర్థము. ఈ ప్రత్యభిజ్ఞాన మహా విషయమునం దీ సన్నివేశము దినమునకు బ్రభాతవేళ వంటిది. ప్రొద్దెక్కను; మొల్లపూవుయొక్క యంతస్తుషారలక్షణము పోవును. ఆ మొల్లపూవు పరిభోగయోగ్యమగును. అది యంతస్తుషారము. తుషార మనఁగా 'తప్తమ్ తోషయతీతి తుషారః' తపించినవానిని సంతోషపెట్టు నది. ఐనచో భ్రమరము నేల సంతోషపెట్టదు? భ్రమ రము తప్తముకాలేదు కనుక, అట్లే రాజును దానధర్మ భావముచేతఁదప్తుఁడు కాలేదు. అందుచేతఁదుషారము పనిచేయుట లేదు. కాని యది తుషారమే. సంతో షింపఁజేయునదియే. తుషార మనఁగా మంచు. నీటి తుంపురులు. ఈ శబ్దముచేత శకుంతల గర్భవతి యన్న యర్థ మున్నది. రేపు ప్రొద్దున నీ గర్భమే యీ తుషారబిందువే భరతుఁడుగా సాక్షాత్కరిచిం

యనపత్యతచేఁ దప్తుఁడయిన దుష్యంతుని సంతోష పెట్టగలుగుటయే. అందుచేత నది 'తుషారమే.'

ఆ కాళిదాసొక్కమాట వేసినచో నది యిట్లుండును.

శ్లోకాదియందు నామె యొక్కరూపము 'అక్లిష్ట కాంతి' యని చెప్పఁబడినది ఆ మాటలోఁ జమత్కార మున్నది కాంతి యనఁగాఁ గోరఁబడుమన్నది యని యర్థము, ఆమె రూపము క్లేశము లేకుండఁ గోరఁ దగినది. ఆ రూపమునందలి వాంఛా లక్షణము అక్లిష్టముగా నున్నది. వాంఛ కానుకూల్యమున్నది. ఆమె తన భార్యయే. లేనిచో నామె రూపము తన్న ట్లాకర్షించదు. సామాన్యముగా నక్లిష్టపుకాంతియనఁగా ననవద్యమయిన సౌందర్యమని సాహిత్య విషయిక మయిన యర్థమే. అంతర్వ్యక్తియై యీ విశేషార్థము భాసించుటకే 'అక్లిష్ట' శబ్ద ముపయోగింపఁబడినది. లేనిచోఁ గాంతియన్న శబ్దమునకు నక్లిష్ట మన్న విశేషణ మెవ్వఁడు వేయును?

'నచ ఖలు పరిభోక్తుమ్' - 'పరిభోక్తుమ్' అన్న క్రియ వాడుటచేత రాజుయొక్క వాంఛాధిక్యము భాసించుచున్నది.

అన్నిటికంటె 'కుంద' మన్న శబ్ద మున్నది. 'కు' భూమిని 'ద్యతి' చీల్చునది. మొల్లతీగ పుట్టునపుడు భూమిని జీల్చుకొని వచ్చుచున్నదని వ్యుత్పత్త్యర్థము. శకుంతలను గుందముగాఁ జెప్పినాఁడు. ఆమె తన యంతఃకరణమునుండి మనస్సును జీల్చికొని వచ్చు చున్నది. ఆమె తన పరిగ్రహ మగుటయొక్క లక్షణ మట్టిది. కాని యీ మనస్సుయొక్క విస్మృతి యంత స్తుషారమయి వారించుచున్నది.

ఈ తుషారమంతర్వ్యక్తియగుటలో విశేషమున్నది. ఆ తుషారము భరతస్థానీయమని చెప్పఁబడినదికదా. దానినే పురోహితుఁడు తరువాత బొంత నీవు చక్ర వర్తినిఁ గందువని సాధువులు చెప్పిరి కదా! ఈ ముని దౌహిత్రుఁడు తల్లక్షణోపపన్నుఁడయినచో న్నామెను స్వీకరింపవచ్చు నన్నాఁడు. ఇప్పుడు తుషారము కుందముయొక్క యంతర్భాగములోన నున్నదనుటలోని సౌందర్యము చూడవచ్చును.

ఈ రీతిగా రసభంగము కాకపోవుట కాదు. శృంగారరసము మిక్కిలి పరిపుష్టమగుచున్నది. వీని చేతఁ బ్రత్యాఖ్యానమునందు బాధ యధికమగు చున్నది.

రాజెంత బాధపడుచున్నాఁడో యీక్రింది యాయన యుపన్యాసముచేతఁ దెలియఁగలదు. ఈయుపన్యాసము మరి తరువాత వచ్చు శ్లోకము రెండును జాలవిచిత్ర ముగా నున్నవి. 'కిమిదం జోషమాస్యతే' ఏమయ్యా మాటలాడవు అని శార్ఙ్గరవుఁడనఁగా రాజు 'భో స్తపో ధనః చింతయన్నపి ఖలు స్వీకరణమత్ర భవత్యా స్స్మరామి. తత్కథమిమా మభివ్యక్త సత్త్వలక్షణాం ప్రతి అత్మానం క్షేత్రిణమాశంకమానః ప్రతిపత్స్యే' అయ్యా! తపోధనుఁడా! ఎంత యాలోచించినను నీపూజ్యురాలిని నేను గ్రహించుట నాకు జ్ఞాపకమునకు వచ్చుటలేదు. అభివ్యక్తసత్త్వలక్షణయైన యీమెను గురించి నేను ఈమెకు భర్తను అన్నవిషయమును భావించెడివాఁడ నెట్లు కాఁగలను. లేదా దానివిగురించి సందేహపడెడువాఁడనుగా నెట్లు కాఁగలను?

'అత్రభవత్యాః స్వీకరణమ్ నస్మరామి.' ఈమెను నేను స్వీకరించుట నాకుజ్ఞాపకములేదు. అత్రభవతీ మయా స్వీకృతేతి నప్రతిపత్స్యే. ఈమె నాచేతఁ బరి గ్రహింపఁబడినదన్న విషయము నాకుఁ దట్టుటలేదు. అని చెప్పుటవేఱు. ఇచ్చటనున్న స్వీకరణమత్ర భవత్యానస్మరామి యన్నదాని యర్థము వేఱు. అవిష యము నాకుఁ దట్టుటలేదు- అన్నదానిలో నున్నంత మూలవిచ్ఛేదము. 'ఆమెను నేను స్వీకరించుట నాకు జ్ఞాపకములేదు'- అన్నదానిలో లేదు. స్వీకరించిన మాట నిజమే కావచ్చును. కావచ్చునుగాదు నిజమే అని నాయంతరాంతరములో నెచ్చటనో యున్నది అని నాయంతఃకరణము చెప్పుచున్నది, కాని నా మనస్సునకుఁ దగులుటలేదు.

ఆవాక్యములోని గడుసుదనమిది. 'తత్కథమిమాం' మొదలగు వాక్యము దొంకతిరుగుడు వాక్యము. సూటిగాఁ జెప్పునదికాదు 'నిజమేనయ్యా. ఆమె యేమో గర్భవతియాయెను. నేనీమెను భార్యగాఁ జేసి

కొంటినియని నే ననుమానపడెడి వాఁడనగుట యే రీతిగాఁ బొందఁగలను అన్న వాక్యము ఇష్టమా యనిష్టమా. లోన నాయన యెంత బాధపడుచున్నాఁడు. గట్టిగాఁ జెప్పలేకుండనున్నాఁడే. విచిత్రముగానున్నది యీ రచన. శార్ఙ్గరవుఁడు శారద్వతుఁడు తూలనాడిరి. శకుంతల నీకిది న్యాయముకాదన్నది. రాజిట్లన్నాఁడు. 'వ్యపదేశ మావిలయితుం కిమీహసేజనమిమంచపాత యితుం। కూలంకషేవ సింధుః ప్రసన్నపంభస్తట రుహంచ' నా కులప్రసిద్ధినిఁ బాడుచేయుట కెందుకుఁ గోరుచున్నావు. నన్నుఁ బతితుని జేయుట కెందుకుఁ గోరుచున్నావు. ఒడ్డు లొరసికొని ప్రవహించు ప్రవాహము తేఁటినీటిని నావిలము చేయునట్లు ఒడ్డుననున్న చెట్లును బడద్రోసినట్లు.

ఇది యేమిసమాధానము? ఆమెయందుఁ దనకుఁ గల కోరికను రాజు దాచుటలేదే ఆమె మహాసౌందర్యమునకుఁ దాను ముగ్ధుఁడయినట్లు రాజు చెప్పివేయుచున్నాఁడే. ఆమె శీలమునందుఁ దనకు ననుమానమన్న ప్రసక్తియేలేదే. మొదటినుండియు నామె 'అత్రభవతీ' పూజ్యురాలని చెప్పుచున్నాఁడు. చివఱ కామెను గూలంకషయైన సింధువనుచున్నాఁడు. ఆమె యొక మహాప్రవాహము. పరమ పవిత్రమయినది జగదుద్ధారకమయినది. కెలని భూములకు సస్యదాయినియైనది. కాలుష్యమును గడిగివేయునది. మహాపర్వతములమీద జన్మించినది. తనకేమిటి భయము. తన కులప్రసిద్ధిపోవునని తానామెను స్వీకరించుటచేత నధర్మమాచరించినవాఁ డగుదునని. కూలంకషమైన సింధువుచేతఁ బ్రసన్నమైన జలమావిలమగును. మఱికొంతసేపటికిఁ దేఱికొనును. తనవంశమునకు వచ్చిన నష్టములేదు. తన వంశమునకు వచ్చెడి యప్రసిద్ధి తాత్కాలికము. పడిపోయిన చెట్టు మరల బ్రదుకదు. నిలువదు. ఆయన కెక్కువ భయము. తాను పతితుఁడనగుదునని. అనఁగా నధర్మముచేసిన వాడఁనగుదునని, ధర్మాధర్మములు లోకవిషయములు. తత్ఫలితము పారలౌకికమయినచోఁ గావచ్చును. తద్విచారణలు చర్యయు లౌకికమయినవి. ఇది మనోవిషయమని పూర్వమే చెప్పఁబడినదిగదా. తన విస్మరణ మనోవిషయము.

ఈ రీతిగా సర్వము సువ్యక్తముగా నున్నది. రస భంగములేదు. కథావిచ్ఛిత్తిలేదు.

ఈమాటలను శకుంతల యెంతచక్కగా నర్థము చేసికొన్నది. ఆమె యన్నదిగదా 'యది పరమార్థతః పరపరిగ్రహ శంకినా త్వయేదం ప్రవృత్తమ్ అభిజ్ఞానేనానేన తవసందేహ మపనేష్యామి' నిజముగా నీకు నేను పరభార్యనని యనుమానమున్నచో నిదిగో యీ గుర్తు చూపించి నీయనుమానము తీర్తును. అపుడు రాజు 'ఉదారఃకల్పః'భేషయినపని. అంతకన్నఁ గావలసినదేమున్నది.

ఇంతవఱకుఁ గథ న్యాయముగా జరిగినది. ఇచ్చటినుండి యద్దము తిరిగినది. ఇతఃపూర్వము శాపముయొక్క లక్షణమే; యిచ్చటినుండి శాపము పనిచేయ నారంభించినది.

(సశేషము)

మధురాంతకం రాజారాం

# మమకారం

అర్ధరాత్రి దాటింది.

దోమల సంగీతంతోనూ, నల్లుల పరామర్శతోనూ పది, పదకొండుదాకా మేలుకున్నానేమో. ఆ తరువాత గాఢంగా నిద్రపట్టింది. కానీ సత్కార్యానికి వెయ్యి విఘ్నాలు! కదిపి కదిపీ లేపి కూర్చోబెట్టింది శకుంతల.

"అబ్బబ్బ, ఏం మొద్దునిద్రండీ మీకు మరీనూ!... ఇష్, బిలంగా మాట్లాడకండి. అవతల కొంపలంటుకుపోతున్నాయి..."

తెల్లబోయి శకుంతలవైపు అయోమయంగా చూచాను.

"చెవి ఒగ్గి వినండి. గుసగుసలు వినిపించడం లేదూ?"

నిజానికి నాకేమీ వినిపించడం లేదు. నిద్రమైకంతో ఆవులిస్తూ "కలగన్నావా శకుంతలా" అన్నాను.

శకుంతల చరాలున పైకి లేచింది. చేయి పట్టుకుని నన్ను వంటగదిలోకి లాక్కెళ్ళింది.

"ఐనా కళ్ళుండీ చూడలేకపోతే, చెవులుండీ వినలేకపోతే ఎలాగండీ! ఆ కుర్రాణ్ణి పొరుగున చేర్చవద్దంటే విన్నారు గారు. అతగాడిప్పుడు ఏం చేశాడో చూశారా! నలుగురికీ తెలిస్తే యింకేమైనా వుందిటండీ! ఊరువూరంతా కలిసివచ్చి పీక ఎముక లేరేయరూ?"

"ఇంతకూ జరిగిం దేమిటో కాస్త వివరంగా చెప్ప గూడదా శకుంతలా?"

"చెబితేమాత్రం మీరు నమ్ముతారు గనుకనా! పైగా మీ స్నేహితుడిపైన లేనిపోని అభాండాలు వేస్తున్నానంటారు. నా కెందుకొచ్చిన పీడ! ఆ చూడవలసిం దేమిటో మీరు మీ కళ్ళతోనే చూస్తే సరిపోతుంది."

"ఏదీ, అదేమిటో కంటికి కనిపించడం లేదే మరి!"

"ఈసారి నన్ను శకుంతల వీథి గుమ్మందాకా లాక్కెళ్ళింది. మెల్లగా గడియ తీసి, ఒకటిరెం డంగుళాల మేరకూ తలుపు తెరిచింది. "కదలకుండా యిక్కడ కూర్చోండి" అంటూ చూపులతోనే సైగ చేసింది.

అర్ధాంగి ఆదేశాన్ని శిరసావహించడం కొన్ని పరిస్థితుల్లో తప్పనిసరి! గోడకు చేరగిలబడి అంధకారంలోకి చూస్తూ కూర్చున్నాను.

శకుంతల అనుమాన మేమిటో నాకు రూఢిగా తెలుసు. ఆమె నాలుగైదు మాసాలుగా ఆ అనుమానాంకురానికి పాది కట్టి, నీరుపెట్టి పోషించుకుంటూ వస్తోంది. ఆ అనుమానం అనుమానంగానే సమసిపోతుందనీ, అందులో వాస్తవం లేశమైనా వుండదనీ నా నమ్మకం. తన వ్యూహ గ్రామాన్నంతా కదిలించివేసే యథార్థంగా బయటపడక తప్పదని శకుంతల విశ్వాసం!

పరువం బుసలుకొట్టే పడుచువాడిలో కొంటెతనం కొంత వరకూ క్షంతవ్యం కాకపోదన్న ఉద్దేశంతో నేనునారాయణను ప్రక్కవాటాలో చేరనిచ్చాను. ఎంత కొంటెవాడైనా కాలికి పాము చుట్టుకున్న తర్వాత కాటు తప్పదన్న సత్యాన్ని అతడు జ్ఞప్తిలో వుంచుకోగలడని ఆశించాను. కానీ శకుంతల కథనాన్నిబట్టి చూస్తే ఆ పొరబాటేదో యిదివరకే జరిగిపోయినట్టు బోధపడుతోంది. అలాగని శకుంతల యింతకూ అంతకూ అపోహలతో సతమతమయ్యే మనిషిగూడా కాదు. కానీ ఈ నారాయణ తనను కట్టివేసే త్రాళ్ళను తానే కొని తెచ్చుకో గలడని నే నెలా అనుకోగలను?

ఒకటి....రెండు....మూడు... మెల్లగా నిమిషాలు గడచి పోతున్నాయి.

ఐనా నారాయణను గురించి యింతగా ఆలోచించవలసిన అవసరమేమీ నాకులేదు. ఇదొకపనిగా పత్తేదారు తనం ఒలకబోసి రహస్యాలు ఆరాతీయవలసిన ప్రమేయమూలేదు. చెరుకు వంకరను తీర్చడానికి గానుగ ఎలాగూ వుండనే వుంటుంది గనుక, నా చింత నారాయణను గురించిగాదు! కానీ నేను నారప్పకు మాటయిచ్చాను. నా తమ్ముడొకటిగాదు. నీదొకటి గాదు. నాకళ్ళుకప్పి అలాటప్పాగా తిరగగలగడం వీడి తరంగాదు. నువ్వికపైన నిశ్చింతగా వుండవచ్చు' అని నమ్మకం చెప్పాను. అరవై వసంతాలు కళ్ళజూచిన ఆ వృద్ధుడి కళ్ళల్లో కృతజ్ఞత కన్నీరుగా పెల్లుబికింది. 'బాబూ! ఇంతమాట చెప్పేనాథుడు ఈనాటికి గానీ కనిపించాడుకాదు. మావాడీ వూరికి రానైనా వచ్చాడుగానీ, తోబుట్టిన అన్న లాంటి వాడివి నువ్వు అండగా దొరికావు. నిజానికి మా నారాయణ మంచివాడు. కానీ కాస్త తెలియనితనం! కుర్ర

వాడుగదా ! ఇది మంచి. యిది చెడ్డ అని నచ్చజెబితే యిట్టే గ్రహిస్తాడు. వెళ్ళొస్తాను బాబూ ! మరచిపోవద్దు వారానికోటాబు వ్రాస్తుండమను..."

బస్సు కదిలింది. కదిలిన బస్సులోనుంచీ దీనంగా నా వైపు చూస్తున్న ఆ ముసలివాడి పరిదీన విగ్రహం యింకా నాకళ్ళల్లో మెదలుతోంది. అవును. నేనతనికి మాట యిచ్చాను. కానీ ఆ మాటను ఎంతవరకూ నిలబెట్టుకో గలిగాను ?

నారాయణను గురించి పొరబాటుగా అంచనా వేసుకున్న అవివేకంనాది. లేకపోతే నారప్పదగ్గర అలా మాట జారి వుండేవాణ్ణిగాను. నారాయణ ఎదుటివాడికేసి చూచే చూపుల్లో అమాయికత్వం తొణికిసలాడినట్టుండేది. అవి నిశ్చలంగానూ. నిర్మలంగానూ వున్న కాసారంలాంటి చూపులైతే, ఆకాసారంలో లోతుల్లో ముళ్ళకంపలూ, మొసళ్ళూ వుండవచ్చునని నేను భావించలేకపోయాను. లేదంటే అతడి మాటల్లో వెకిలితనం మాత్రం బాహాటంగానే గోచరించేది. ఐతే ఆ వెకిలితనం అతడిలో లోపలి తెంపరితనానికి బాహ్య లక్షణమని నే నూహించలేకపోయాను.

నిమిషాలు పరుగెడుతున్నాయి. పది, పదిహేను, యిరవై. ఇంచుమించు అరగంట కావస్తోంది.

మెల్లగా ఒక్కింత సవ్వడి.. నిశ్చలమైన వాతావరణంలో ఓ పిల్లతెమ్మెర లేచినట్టుగా తలుపుతెరచిన సవ్వడి విని పించింది.

ముఖాన్ని ముసుగులో దాచుకుని, చేతిలో గాజులుసైతం కదలకుండా జాగ్రత్తపడుతూ, చీకటిలో చీకటిగా కలిసి ముందుకు కదిలిపోతున్న ఆకారం ఒకటి నాకు దృగ్గోచరమైంది. ఆ ఆకారం వసారా దాటింది, వీధిమెట్లు దిగింది. ఆకాశంలో జర్రున జారిపోతున్న మేఘశకలంలా నా దృక్పథంనుంచీ మాయమైపోయింది.

ఎలాపైకి లేచానో నాకు తెలియదు. వెళ్ళి, హాల్లో నా పరుపుపైన కూలబడిపోయాను.

బయట మంచుకురుస్తున్న ఆ అర్ధరాత్రి సమయాన నా ముఖాన స్వేదం గుప్పుగుప్పున పొటమరించి పోతోంది.

శకుంతల చేరువకువచ్చి కంగారుతో నా రొమ్ముపైన చేయివేసి చూచింది - గుండె యింజనులా రొప్పుతోంది.

"ఐనా బలేవారండీ మీరు ! ఇప్పుడు మీ నెత్తిపైకే మొచ్చిందని ! ఏ వాగు ఏ వంకలో కలిస్తే మనదేంపోయింది? లేదంటే దుష్టున్ని దూరంగా వుంచమన్నారు, ఆపనిచేస్తే సరిపోతుంది...."

"అదిగాదు శకుంతలా! వీడిదుష్ప్రవర్తనకు మనం పూచీ పడవలసి వుంటుందని నేననుకోను. కానీ వీడి మొండిధైర్యం తలచుకున్న కొద్దీ నాకు గుండె జలదరించిపోతోంది. ఆ సీతారామయ్యగారు గండరగండడు. ఊరంతా ఆయన చెప్పు చేతల్లోవుంది. వీడిని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్ళు త్రాగించడం ఆయనకు చిటికెలోపని. ఇక ఆయనగారి కుమారులంటేనా, సామదాన భేదోపాయాలు తండ్రిగారివైతే చిట్టచివరి దండోపాయం వాళ్ళది. వాళ్ళుగనుక ఓ చేయి చూడదలచుకున్నారంటే, వీడికిక ఈ లోకంలో నూకలుండవు. చూచిచూచీ నిప్పులోకి వురికే మూర్ఖుడెవడైనా వుంటాడా శకుంతలా? వీడిగుండె నిబ్బరాన్ని ఏమనుకోవాలి?"

"ఐతే మీ కిప్పటికిగానీ తెలిసిరాలేదన్న మాట! నెలలబొడుగునా చెవిలో యిల్లుగట్టుకుని చెబితే ఒప్పుకున్నారుగాదే మరి !" అంతటితో తన కర్తవ్యం తీరిపోయినట్టు శకుంతల చాపపైకి వ్రాలిపోయింది.

కానీ నా బుర్రలోమాత్రం ఆలోచనలు సుళ్ళు తిరిగి పోతున్నాయి.

ఇక్కడ తప్పు యిరువైపులా వున్నప్పటికీ, ముప్పు ఒకరిపైకి మాత్రమే కేంద్రీకరింప బడుతోంది. వాయిదా చెల్లిన ప్రోనోట్ల కెన్నింటికో మళ్ళీ జీవ మిచ్చి అణాపైసలతో సహా కక్కించుకో గలిగిన సీతారామయ్యగారు తన జేబులోని ఓ చెల్లని నాణాన్ని మార్చుకోలేకపోడు. కానీ ఆయన ఎంటింట్లో జొరబడిన కుందేలులాంటి ఈ నారాయణను మాత్రం మన్నించి వూరుకోడు.

అయ్యో పాపం ! ఈ నారాయణ నుదుట ఎలాటి దుర్గతి వ్రాసిపెట్టాడో భగవంతుడు !

వీడి సంగతలా వుండగా నారప్ప జీవితానికి యింతకంటే దారుణాఘాతం వేరొకటి వుండబోదు.

నారప్ప కొక్కడే కొడుకు. వీడి కైదో ఏడు జరుగుతుండగా తల్లిపోయింది. తల్లిలేని కొరత కుమారుడి బ్రతుకుపైన చీకటి నీడలు చిమ్మకుండా వాడి ముద్దు చెల్లించడం కోసం, వాడి ముచ్చట తీర్చడంకోసమే తండ్రి తన జీవితాన్ని అంకితం చేశాడు. నారప్పకు ప్రస్తుతం ఆస్తిపాస్తులు లేవు. ఒకప్పు డుండేవి. ఆ ఒకటి ఒకటిన్నర ఎకరా మెట్టపొలం నారాయణ చదువుక్రింద దఖలు పడిపోయింది. అన్నీపోగా మిగిలి వున్న పూరిపాకలో నారప్ప కాపురం. నాలుగు మేకపిల్లల్ని మేపుకోడంతో బాటు కూలీనాలీ చేసుకోడం బ్రతుకుతెరువు.

వార్ధక్యంలో తండ్రి కొక పూతకర్రగా వుండి, వీలైనన్ని సదుపాయాలతో అతనికి సుఖశాంతుల్నీ సంతృప్తినీ చేకూర్చి

పితృఋణంనుంచీ విముక్తుడు గావడం కుమారుని బాధ్యత. అంతవనీ చేయలేకపోతే మానె, అవసానదశలో తండ్రి చిత్తశాంతికి అగ్గిపుల్ల గీసి ముట్టించే నారాయణలాంటి కుమారుణ్ణి ఎలా మందలించాలి ? ఎలా సరిదిద్దాలి ?

ఆలోచనలతోనే నాకు తెల్లవారింది.

ఆ రోజు సాయంత్రం స్కూలు వదిలిన తర్వాత నారాయణను పూరిబయటకు తీసుకెళ్ళాను. ఏటవాలుగా వున్న ఏటి యిసుకతిన్నెపైన పవ్వళించి నీటిపాయలో కాళ్ళాడిస్తూ ఓ సినిమా పాట ముదలంకించుకున్నాడు నారాయణ.

పాట పూర్తయ్యే దాకా ఓపికపట్టి "నీకో మాట చెప్పాలని యిక్కడికి తీసుకొచ్చాను నారాయణా !" అన్నాను.

"ఒకటేమిటి? వెయ్యి మాటలు చెప్పండి !"

"ఎందుకంటే చెప్పేవాళ్ళు లేక చెడిపోయిన వాళ్ళు చాలామంది."

"చెప్పేవాళ్ళున్నా చెడిపోతున్న వాళ్ళమాట మాత్రం చెప్పారు కారు."

"వాళ్ళతో మనకు ప్రసక్తిలేదు. ఇప్పుడు నేను చెబుతున్నాను. చెప్పడానికి ముందుగా మనం ఒక విషయంపట్ల ఏకాభిప్రాయానికి రావాలి...."

"అలాగైతే మనకు అభిప్రాయభేదాలు గూడా వున్నాయంటారా మాస్టరుగారూ !"

"నేను నీ శ్రేయస్సును అభిలషించేవాణ్ణి. నీ హితాన్ని ఆకాంక్షించేవాణ్ణి. ఈ విషయంలో నీ కపనమ్మకాలు లేవనుకుంటాను...."

"అబ్బే, ఎంతమాట ! మీపైన అపనమ్మకమా ? నాకు!"

"నువ్వీ పూరికి క్రొత్తవాడివి. నువ్వూ, నీతోబాటు నేనూ ఉదరపోషణకోసం మాస్టరుగిరీ చేసుకుంటూ యిలా పూళ్ళవెంట తిరుగుతున్నాము. మన తాహతును మనం గుర్తుంచుకుని, అనువుగానిచోట ఆధిక్యమును ప్రదర్శించకుండా, కన్నుపోయే కాటుకేదో తెలుసుకుని కాలమొక రీతిగా గడుపుకపోవాలి. ఇక్కడి మనుషుల గుణదోషాలను గురించి నీకంతగా తెలియదు. న్యాయాలు, ధర్మాలు, శిక్షలూ, సిద్ధాంతాలు, ఇవన్నీ యీ పూరికంటూ ప్రత్యేకంగా ఏర్పడి వున్నాయి. అవివేకంవల్ల నైతేనేమి, అనాలోచితంగా నైతేనేమి, నువ్వు బురదలో కాలువేశావు. నీబుద్ధి పెడదారి వెంట ప్రసరిస్తోంది. తీరా ఆకులు కాలినతర్వాత చేతులు పట్టుకోడం వల్ల లాభంవుండదు."

"అదేమిటి మాస్టరుగారూ ! మీ మాటలు వింటుంటే నాకు ఏడుపొస్తోంది. నిజానికి నేనేదో పొరబాటుచేసినట్టే వున్నాను. అదేమిటో నాకైతే తెలియడంలేదు గానీ, మీరెంతో మెలకువగా దాన్ని పసిగట్టేసినట్టున్నారు. మీకు పుణ్యముంటుంది. త్వరగా చెప్పేసెయ్యండి—" తెచ్చిపెట్టుకున్న దిగులును ముఖంలో రంగరించుకుని, నిజంగానే ఏడుపుముఖం పెట్టేశాడు నారాయణ !

"సీతారామయ్యగారి అమ్మాయికైతే వివేకం లేకపోవచ్చు కానీ నువ్వు మగవాడివి. చదువుకున్నవాడివి. నీకైనా కాస్త తెలివితేట లుండాలని లోకులు ఆశిస్తారు—"

నారాయణ ఆలోచనలో పడ్డాడు. ఇంత త్వరగా నేను నా ఆరోపణను బట్టబయలుచేయగలనని అతడు భావించలేదేమో! దీన్నెలా ఎదుర్కోవడమో తోచక తటపటాయిస్తూ, ఆ తికమకను కప్పిపుచ్చుకోడానికి ఓ సిగరెట్టు ముట్టించాడు.

ఒకటి రెండు నిమిషాలు అలా గడచిపోయిన తర్వాత అత డున్నట్టుండి ఓ నిర్ణయానికి వచ్చినట్టు "ఐతే మీ రిప్పుడనేదేమిటి మాస్టరుగారూ !" అన్నాడు.

"ఒళ్ళెరుగని శివం పనికిరాదని !"

"మీ సలహాకు కృతజ్ఞుణ్ణి !"

"ఇక్కడ కృతజ్ఞత కెవరూ ముఖంవాచి కూర్చోలేదు. నువ్వు బాగుపడడమే నాకు కావలిసింది—"

నారాయణ పక్కున నవ్వేశాడు. "నా బాగును గురించి మీరింతగా గాబరాపడవలసిన అవసరం లేదనుకుంటాను.

"మాస్టరుగారూ! మీరు కుర్రాళ్ళకు పాఠాలు చెబుతుండగా ఎన్నోసార్లు విన్నాను. మంచి మంచి నీతికథల్ని మీరు పిల్లల మనసుల్లో హత్తుకుపోయేటట్టుగా చెప్పగలరు ! అబద్ధం చెప్పకపోవడం మంచిదే ! కానీ అబద్ధంతో అవసరంలేని దెవడికి? దీన్నే మరొకవిధంగా చెబుతాను నేను త్రోవంట నడుస్తున్నా ననుకోండి. నాకొక అమూల్యమైన వస్తువు కనిపిస్తుంది. అది పరుల సొత్తు గనుక మీరు తాకిగూడదంటారు. అదే నోట సిరిరా మోకా లడ్డేవాణ్ణి మీ రేమంటారు ? బుద్ధిహీనుడంటారు. అందుకే నీతులంటే నాకు నమ్మకం లేదు. లోకంలో మానవుడికి సంబంధించినంత వరకూ ఒక్కటే ఒక్క నీతి మాత్రం వుంది. తనకు అందిన పండు తీయన, అందని పండు పుల్లన !"

నేను నివ్వెరపడిపోయాను. నా హితవునే అందిపుచ్చుకుని పలుపులు తిరిగి తిరిగీ చివరకు నారాయణ నాచెంప కొకచపేటాన్ని ప్రసాదించాడు. కొరడా పెట్టి నా ముఖాన ఒక వాత తీసేశాడు.

నా మందలింపు కింత సూటిగా జవాబొస్తుందని మాత్రం నేను కలగనలేదు. లేదంటే యితడు తన చెడు చెయిదానికి పవిత్ర ప్రణయమన్న మేలిముసుగును తెచ్చుకోగల దను

కున్నాను. ఎప్పటికప్పుడే తారుమారైపోతూవచ్చిన నారాయణను గురించిన అభిప్రాయాల్లో యిదీ ఒకటైపోయింది.

నేను కృంగిపోయాను. నారాయణకు తోడిమానవుల పట్ల వున్న విశ్వాసం అంతంతమాత్రం! మానవజాతి మనుగడ కంతకూ ఆధారభూతమైనది అవకాశవాదమే ననుకునే మనీషాలవ దుర్విదగ్ధునికి ఒక మంచిమాట చెప్పబోయినందుకు నాకు సరైన శాస్తే జరిగింది.

తటాలున పైకిలేచి తిరిగిచూడకుండా యింటిదారి పట్టాను. నారాయణ దీపశిఖలో దూకబోతున్న శలభం! దూకనీ. ఒళ్ళు కాలనీ. రెక్కలు రాలిపోనీ! ఏ దేమైతే నాకేం కావాలి?

* * * *

"కళ్ళు తెరచుకుని చూస్తున్నారు గదండీ! కొంప మునగనే మునిగింది!"

"ఏం జరిగింది శకుంతలా!" ఆతురతగా అడిగాను.

"ఇది నాలుగో నెలట!"

"నీకెలా తెలిసింది?"

"నాకేకాదు, ఊరికంతా తెలిసింది."

"ఐతే సీతారామయ్యగారు పెట్టెలో పాములా ఎందుకున్నారో?"

"ఏమిటోమరి! ఆయనకు కడుపులో పళ్ళు. మనసులో వున్న దేమిటో ఎవరికి తెలుస్తుంది?"

సీతారామయ్యగారు యిలాంటి విషయంపట్ల మౌనంగా వున్నారంటే యిదేదో ప్రమాదానికి సూచనేనన్నమాట! మేఘాలులేకపోయినా పిడుగులు పడవచ్చు. వానలు లేకపోయినా వరదలు రావచ్చు!

హఠాత్తుగా ఓరోజు రాత్రి పదిగింటలప్పుడు సీతారామయ్యగారిమేడపైన గ్రామంపెద్దల అత్యవసర అంతరంగిక సమావేశం జరిగింది. జట్టీలకు గురువులాంటి మిరియాల గంగన్నద్వారా నారాయణ సభాసముఖానికి రప్పింపబడ్డాడు.

వ్యవహారాలను పరిష్కరించడంలో సీతారామయ్యగారికి ఒక ప్రత్యేకమైన కౌశలం వుంది. ఆయన గోటితో పోయే పనికి గొడ్డలీ తేగలరు. గొడ్డలితో గానీ సాధ్యంకాని సమస్యను గోటితోనూ తుడిచిపెట్టగలరు.

ఈ సందర్భంలో ఆయన తమరెండో పద్ధతిని అవలంబించారు. సైగలతోనే మాట్లాడుకుని, చూపులతోనే యింగితాన్ని తెలుసుకుని సభాసదులు మూడు ముక్కల్లో తమ నిర్ణయాన్ని తేల్చి చెప్పారు - తప్పుజరిగింది. ఎలా జరిగిందన్న విచికిత్స యిప్పుడు అనవసరం. ఇందుకు నారాయణను బ్రతికుండగానే పాతిబెట్టినా అడిగేవాడు లేడు. కానీ సీతారామయ్యగారు దయదలచి అతణ్ణి మన్నించేస్తున్నారు. శిక్ష - అతడు అమ్మాయిని పెళ్ళి చేసుకోడమే! ముహూర్తం కూడా నిర్ణయమైపోయింది. పది రోజుల్లో పెళ్ళి. రెండుమూడు రోజుల్లో వివాహపత్రికలు అచ్చై రాబోతున్నాయి.

ఆ రెండుమూడు రోజుల్లో నారాయణ ముఖాన్ని పరిశీలనగా చూచే అవకాశం నాకు దొరికిందిగాదు. అతడు మనుషుల్ని తప్పించుకుని తిరుగుతున్నాడు. వివాహంతాలూకు పరిణామ మెలాంటిదైనా వివాహం మాత్రం మానవుడికి ఆనంద హేతువే! కానీ నారాయణ ప్రవర్తనలో ఆనందం సంగతి దేవుడెరుగు, భయమూ ఆందోళనా మాత్రం ప్రస్ఫుటంగా కనపిస్తున్నాయి.

సీతారామయ్యగారి అమ్మాయి నలుగురు మగరాయళ్ళ మధ్య ఒక్కగానొక్క ఆడపడుచు, ఆమెపేరు పార్వతి. పార్వతి నివాసం తరచుగా తల్లినెత్తిమీద! అంతగా ఆమె కూతుర్ని నెత్తికెక్కించుకుంటుందన్నమాట! గ్రామ రాజ్యంలో తండ్రికొడుకులమాట కెలాగైతే తిరుగులేదో, గృహరాజ్యంలో తల్లీకూతుళ్ళ పెత్తనాని కలాగే తిరుగులేదు. సంగ్రహంగా చెప్పాలంటే పార్వతిని పెళ్ళాడబోతున్న వాడెవడైతే వున్నాడో, వాడికి పార్వతే మొగుడు!

ఈ పద్మవ్యూహంనుంచి తప్పించుకుని పారిపోవాలన్న సదుద్దేశం నారాయణకు కలిగిందో లేదో నేను చెప్పలేను. బహుశా కలిగేవుంటుంది. కలిగివుండదని భావించడం నారాయణ స్వభావాన్ని గుర్తెరుగక పోవడమే. కానీ కంటికి రెప్పలా నిగాబెట్టి రాత్రుల్లోసైతం యింటికెదురుగా భజనగుడి అరుగుపైన పడుకుంటున్న మిరియాల గంగన్న కళ్ళల్లో కారం కొట్టడం ఎవరితరం?

వీలైతే పారిపోయి వెక్కిరించే బుద్ధిమంతుడే నారాయణ! కానీ వీలులేకపోవడంవల్ల చిక్కి బిక్కిరించక తప్పిందిగాదు.

రోజులుమాత్రం దొర్లిపోతున్నాయి. ఊళ్ళో పెళ్ళి పత్రికలుగూడా పంచేశారు. వివాహానికింక నాలుగు రోజులకన్నా వ్యవధి లేదు.

మిట్టమధ్యాహ్నం. గదిలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాను. మెల్లగా తలుపు తెరచుకుని కత్తివేటుకు నెత్తురు చుక్క లేని ముఖంతో నారాయణ లోపలికి వచ్చాడు.

అందిన పండు తీయగానే వుందిగదూ-అంటూ నారాయణను పరామర్శించా లనిపించింది. కానీ చచ్చిన పామును మళ్ళీ చితకబాదడం అనవసరమే గాక అమానుషంగూడా కావచ్చు ననిపించి మౌనంగా వుండిపోయాను. ఉండి, వుండీ నారాయణే ప్రారంభించాడు——

"మీరు నాకొక చిన్న సహాయం చేయగలరా మాస్టరు గారూ!"

తల పైకెత్తి అతడివైపు చూశాను.

"మిమ్మల్ని నేను మన్నించమని అడిగేస్థితిలో లేను. కానీ మీరు ఎడతెగకుండా తప్పులు చేసే కుర్రవాళ్ళని క్షమించడానికి అలవాటుపడ్డారు. వాళ్ళల్లో నన్నూ ఒక్కణ్ణిగా భావించలేరూ?"

"ఉపోద్ఘాత మెందుకూ. సహాయ మేమిటో చెప్పు" అన్నాను.

"మీరు మా ఊరికి వెళ్ళిరావాలి"

"ఎందుకూ?"

జేబులోనుంచి ఒక జాబు తీసి నా చేతి కందించాడు నారాయణ.

తనకు ఒంట్లో కులాసాగా వుండటం లేదని టూకీగా వ్రాయించి, మిగిలిన జాబంతటా కుమారుడి యోగక్షేమాల పట్ల తనకున్న ఆసక్తినీ, ఆరాటాన్నీ నింపి పంపాడు నారప్ప.

"ఐతే ఆయనకింకా వివాహ వర్తమానం తెలియదన్న మాట!"

"ఎలా తెలుస్తుంది! నేను జాబైనా వ్రాయలేదు. మీకు తెలుసు. నేను ఏం చేయాలో, ఏం చేయకూడదో తెలియని దిక్కులు దోచని పరిస్థితిలో వున్నాను. పైగా జాబు వ్రాస్తే వూళ్ళో లేనిపోని పుకార్లు అల్లుకపోతాయి. మీరు గనుక వెళ్తే నేరుగా అన్ని విషయాలూ సర్ది చెప్పగలరు...."

ఎన్నడూ లేనిది నారాయణ కంఠంలో గాద్గద్యం స్పష్టంగా పెల్లుబికింది. చూపులు భూపతనమైపోగా పది పదిహేను నిమిషాల వరకూ అతడలాగే కూర్చుండి పోయాడు.

* * *

పెండ్లి పిలుపును మోసుకుని ఉదయం పదిగంటలప్పుడు బస్సెక్కాను. తుమ్మచెట్లు, ముళ్ళకంపలు బలిసిపోయిన పొలంబొలు బీళ్ళమధ్య, నిగనిగలాడే కరవాలపు టంచులాంటి నీ రెండలో, మలుపులు తిరిగిపోతున్న మట్టి బాటపైన బస్సు పరుగిడుతోంది. మొదట పన్నీటి స్నానంలాంటి చెమట. ఆపైన చందన పరాగంలాంటి ఎర్రటి దుమ్ముతో నలుగు: వీటితో ప్రయాణీకులకు యథోచిత సత్కారం జరిగి పోతోంది.

ఈ బస్సులోనుంచి వేరొక బస్సులోకి మారి, ఆ తరువాత కాలిబాటవెంట అయిదు మైళ్ళు నడిస్తేగాని కళ్ళకు కనిపించదు రంగసముద్రం!

మన పల్లెటూళ్ళకు దారిడొంక లుండవనీ, అవి దమ్మిడీకి గూడా పనికిరావనీ పాట వ్రాసిన తర్వాత పాతికేళ్ళకు గూడా సరిగ్గా అదే పరిస్థితిలో వున్న కుగ్రామం రంగసముద్రం!

బస్సు పన్నెండున్నర గంటలకు తన గమ్యస్థానం చేరుకుంది. తీరా అక్కడ దిగిన తర్వాత మళ్ళీ నే నెక్కవలసిన బస్సు అరగంట ముందుగా వెళ్ళిపోయినట్టు కబురు తెలిసింది. గోళ్ళు గిల్లుకుంటూ మూడుగంటలసేపు బస్‌స్టాండులో పడిగాపులు పడడంకన్నా గత్యంతరం లేకపోయింది.

ప్రయాణాలు చేయబోకండి—అన్న హెచ్చరికకు రూప కల్పన లాంటిది ఆ రెండో బస్సు. చావు దప్పి కన్ను లొట్టబోగా యుద్ధభూమి నుంచి పారిపోయివచ్చిన క్షతగాత్రుడిలా కనిపించిందది! చిన్న గుహలాంటి ఆ బస్సులో ప్రయాణం మనిషిని గోతంలోకి త్రోసి, మూతి బిగించి, రూళ్ళకర్రతో చిత్తుచిత్తుగా బాదడంలాంటి అనుభవం! ఈ లక్షణానికి దోడూ అడపా దడపా మరమ్మత్తులతో లాలించకపోతే ముందుకు కదలనన్న మంకుపట్టొకటి దానికి! పోగా సముద్రాన్ని ఆపోశనం పట్టిన కుంభసంభవుడికీ, దీనికీ వున్న బంధుత్వమెలాటిదో మనకు తెలియదు. బాట ప్రక్కన ఎక్కడ జలాశయం కనిపించినా నాలుగు బకెట్ల నీళ్ళుతెచ్చి వుదరంలో పోస్తేగాని దానికి తృప్తిలేదు!

ఈ బస్సులో నుంచి బయటపడేసరికి యిటు నేలపైనా గాక, అటు వినువీధిలోనూ గాక అంతర్మధ్యంలో వూగిసలాడి పోయినట్టు, గిరికీలుకొట్టినట్టు ఓ విచిత్రమైన అనుభూతి కలిగింది.

రాత్రి ఎనిమిది గంటల వేళ. ఇదివరకెన్నడూ చూచి ఎరుగని వూరు. ఊళ్ళో ఒకటి రెండు చిల్లరంగళ్ళు తప్పితే హోటళ్ళూ, గీటళ్ళూ లేవని వర్తమానం! అరవడి శనగపప్పు తిని మిగిలిన ఆకలిని దాహం చల్లార్చలేని వుప్పునీళ్ళతో పూరించి, శిథిలావస్థలో వున్న పాతసత్రంలో విశ్రమించాను.

ఎప్పుడు తెల్లవారిందో నాకు తెలియదు. కళ్ళు తెరిచేసరికి తూరుపుకొండకు రెండు బారల పైన సూర్యుడు మళ్ళీ నే నున్నానంటూ ప్రత్యక్షమయ్యాడు.

రంగసముద్రానికి ఎలా వెళ్ళాలో, ఎక్కడెక్కడ మలుపులు తిరగాలో వివరంగా చెప్పి ఓ వృద్ధుడు పుణ్యం గట్టుకున్నాడు. దూరంగా ఒక గుట్ట. గుట్టపైన మూడు తాటి చెట్లు. వృద్ధుడి వివరాలన్నింటిలోనూ ఈ కొండ గుర్తు నాకు బాగా వుపకరించింది.

డొంకదారి నన్ను చేలలో దిగవిడిచి వెనుకబడిపోయింది. కనుచూపు మేరకూ నల్లరేగడి చేలు. కనుమల్లో రక్తం గడ్డ కట్టినటుగా పువ్వులతో క్రిక్కిరిసిన మోదుగచెట్లు. మానికలు

చిరుగులుపడిన దుస్తులతో భుజాన తట్టలువేసుకుని పొలంలోకి పేడకోసం, పొయిలోకి చిదుగుల కోసం పరుగులుతీస్తున్న కాపుకన్నెలు. ఈ ప్రకృతి వేరు. ఈ మనుషులు వేరు. పట్టణాలు పార్కుల్లాంటివి. అక్కడ ప్రతి చెట్టుకూ దోహద క్రియలు జరిపేవారున్నారు. ప్రతి తీవకూ ఆలంబనం ఏర్పాటు చేసేవారున్నారు. ఇక్కడ ఎన్ని చెట్లు మోడైనా పట్టించుకునే వాడు లేడు. ఎన్ని తీగలు ఎండల దుమ్ములో మాడి ముద మారిపోయినా గమనించేవాడు లేడు.

ఇలాంటి పరిసరాల్లో అంగ రంగ వైభోగంలాంటి నవ నాగరికత నుంచి దూరంగా విసరివేయబడినట్టున్న రంగ సముద్రం చింతచెట్ల క్రిందబిక్కుబిక్కుమంటూ కనిపించింది.

రచ్చదగ్గర నిల్చుని 'నారప్ప యిల్లెక్కడ ?' అని వాకబు చేశాను.

"ఇదిగో, యిక్కడే !" అంటూ కుర్రవాడొకడు ఒక పూరికొట్టం చూపించాడు.

ఉప్పుతినిపోతున్న గోడలతో, కప్పెగిరిపోయి వెదుళ్ళు పైకి కనిపిస్తున్న ఆ పూరి కొట్టంలోకి తొంగిచూచాను. మూలగా ఓ కుక్కిమంచం. మంచంపైన ఎముకల ప్రోవులా పడివున్నాడు నారప్ప.

"నారప్ప తాతా ! నీకోసం ఎవరో వచ్చారు" అన్నాడు కుర్రవాడు.

"ఎవరు బాబూ ! ఎవరు ?" ఖర్జూరపు పళ్ళలా బిగుసుకి పోయిన పెదవులపైనుంచి మాటలు నీరసంగా వెలువడ్డాయి. దట్టంగా పెరిగిన తెల్లటి గడ్డానికి వెనుక అతడి కళ్ళు నిప్పు లేని ఆగాధాల్లా వున్నాయి.

"ఇదేమిటి నారప్పా ! ఇంత జబ్బులో కొట్టుమిట్టాడి పోతూ. విషయాన్ని వున్నదున్నట్టుగా వ్రాయించలేక పోయావా ?" అంటూమంచంపైన ఒక వారగా కూర్చున్నాను

"నువ్వానాయనా ! నా జబ్బుకేంగానీ ఎప్పుడొచ్చావు ? ఇంతదూరం నువ్వొక్కడివే వచ్చావా ? నారాయణ ఏడీ ! కుర్రాడు బాగున్నాడుకదూ ? వాడికిబ్బందేమీ కలుగలేదు గదూ ?"

"మరేం కంగారుపడకు నారప్పా ! నారాయణ నిక్షేపంలా వున్నాడు. నేను నీకొక శుభవార్త చెప్పడానికి వచ్చాను. నారాయణకు పెళ్ళి హఠాత్తుగా నిర్ణయమైపోయింది...."

"పెళ్ళే ! మా నారాయణకేనా బాబూ ! నిజంగా ?" అగాధంలో బుగ్గపుట్టి తటాలున నీటిమట్టం పైకి లేచినట్టు అతడికళ్ళల్లో ఓవింతకాంతి హోరులెత్తింది.

"నిజమే నారప్పా ! పరిస్థితులన్నీ అలాకుదిరాయి. కల్యాణమొచ్చినా కక్కొచ్చినా ఆగదన్నారుగదా మరి ! నువ్వుదగ్గర లేనందుకు నారాయణ ఎంతగానో నొచ్చుకున్నాడు...."

"భగవంతుడు నాయనా ! భగవంతుడు. మనిషి చేయగలిగిందేముంది చెప్పు. నాకు తెలుసు మా నారాయణకెవరో ఒకరు పిలిచి పిల్లనిస్తారనే నేననుకున్నాను. చెప్పు బాబూ చెప్పు ! సంబంధం ఎక్కడిది ? పెళ్ళెప్పుడు ?"

"ఉన్నవాళ్ళతో సంబంధం ! అందుకే వురకలు పెట్టూ వచ్చి కాళ్ళకు చుట్టుకుంది ! వ్యవధిగూడా అట్టేలేదు. ఎల్లుండి తెల్లవారుఝామున ముహూర్తం"

"అలాగా బాబూ ! నువ్వు నా కడుపులో పాలుపోశావు. చెప్పరానంత ఆనందంగా వుంది నాకు.... ఒరేయ్ రంగడూ ! ఒక లగువుతో వెళ్ళి ఆచార్లుగారిని కేకేసుకరా ! వేగిరం వెళ్ళు, యిక్కడున్నట్టుగా రావాలి మరి !" కుర్రవాడు పరుగందుకోగానే మళ్ళీ ప్రారంభించాడు నారప్ప "ఆచార్లుగారంటే ఎవరనుకుంటున్నావు బాబూ ! రాజ వైద్యుడు, మహానుభావుడు. అతడే గనుక లేకుంటే నేను మొన్నరాత్రే కళ్ళు మూసుకోవలసింది. ఇంత కట్టు మాత్ర రంగరించి పోశాడో లేదో, కొండంత జ్వరం కొండెక్కిపోయింది. అసలారాత్రి మాత దర్శనం గూడా అయింది నాకు. ఒకడు కాదు నాయనా యిద్దరు ! తుమ్మమొద్దుల్లా వున్నారు. శూలాలు చేత బట్టుకున్నారు. చంద్రనిప్పుల్లా యింతింత లేనికళ్ళు. 'ఊఁ వెళ్దాం రా ! నీ ఆకు బయటపడింది' అన్నారు. నిజం చెప్పొద్దూ ! కోపమొస్తే నేను మనిషినే గాను ! 'వెళ్ళండి. వలుసులా ఒక్క బిడ్డ నాకు. వాడొక యింటివాడు కాందే నేను కదలనంటే కదలను' అంటూ తరిమి తలుపేసుకున్నాను. కలేననుకో బాబూ ! కానీ కళ్ళముందే జరిగినట్టుంది. మాతలలా వచ్చివెళ్ళిపోడం, నువ్వీ మంచి సంగతి తెచ్చి నా చెవిలో వేయడం...." ఆయాసంతో నారప్పకు ఒగర్పు పుట్టింది. లేచి కూర్చోడానికి ఒకటి రెండు విఫల ప్రయత్నాలు చేసి, అతడు మళ్ళీ తలగడ పైకి ఒరిగిపోయాడు.

"ఏమిటి నారప్పా ! ఎలా వుంది ? నీకోసం ఎవరో వచ్చారటగా" అంటూ లోపలికి వచ్చారు ఆచార్లుగారు. ఆయనతో బాటు యిరుగుపొరుగువాళ్ళు ఆయిదారుగురు బిలబిలా వచ్చేశారు.

"వచ్చింది ఈయనేనంటే ఆచార్లూ ! మా అబ్బాయి స్నేహితుడు. పెళ్ళి గనుక స్వయంగా రావడానికి వీల్లేక నారాయణ స్నేహితుణ్ణి పంపించాడు. చూడండి ఆచార్లూ ! తమ ఋణం వుంచుకోను. రేపీపాటికల్లా లేచి నడవగలిగేటట్టుగా నాకో మందివ్వలేరూ ?"

ఆచార్లుగారు వెస్తుపోతూ నారప్ప వైపు పరకాయించి చూచారు. ఆ తరువాత నన్ను తమ వెంట రమ్మని చేయి విసరి మెల్లగా బయటికి దారితీశారు.

"ఇదేమిటి నాయనా! ఆ ముసలాడు మంచంపై నుంచి దిగేస్థితిలో వున్నాడనుకుంటున్నావా నువ్వు! గడచిన రాత్రి గూడా జ్వరమూ, జ్వరంతో బాటు చలీ ముంచుకొచ్చేశాయి. మాయదారి జ్వరం. దీన్ని నమ్మడానికి వీల్లేదు. తగ్గినట్టే తగ్గి పుట్టిసి నష్టేటిపాలుచేస్తుంది. ఉన్నమాట చెప్పేశాను. తరువాత నీ యిష్టం...."

"మరి కుమారుడికి పెళ్ళిగదండీ! తండ్రి కెంతైనా వుబలాటంగా వుండదూ ?"

"ఏడ్చాడు! వాడొక కుమారుడు. ఆ కుమారుడికీ సిగ్గులేదు. మొన్న పోయిన అమావాస్యకూ సిగ్గులేదు. తండ్రి కొక పూట తిండి పెట్టలేని ఆ వెధవకు పెళ్ళవుతోందని, ముసలి ప్రాణానికి ముప్పు తలపెడ్తావా నువ్వు !"

ఆచార్లుగారు వెళ్ళిపోయారు. బరువెక్కిన హృదయంతో మళ్ళీ లోపలికి వెళ్ళాను.

"ఏమంటున్నారు బాబూ ఆచార్లుగారు ?" ఆశగా అడిగాడు నారప్ప.

"నువ్వు మంచంమీదినుంచి కదలడానికి వీల్లేదంటున్నారు...."

నారప్పముఖం వివర్ణమైపోయింది. "అంటారు. ఎందుకనరు! మంచి మందివ్వవలసి వస్తుందని అతగాడిబెంగ!" ఆశక్తి ఎక్కడినుంచి వచ్చిందో నాకు తెలియదు. చివాలున లేచికూర్చున్నాడు నారప్ప - "అక్కర్లేదు. నాకు మందే అక్కర్లేదు. రేపీపాటికల్లా నేనులేచి చకచకా నడవలేకపోతే అప్పుడడుగు...." నారప్ప శరీరం గాలిలో దీపంలా కదిలిపోతోంది. అతడు రొజుకుంటూ వెంతపైకి వ్రాలిపోయాడు. ఉచ్ఛ్వాస నిశ్వాసాల వురవడిలో రొమ్ము కొలిమితిత్తిలా క్రిందుమీదవుతోంది.

ఆరోజురాత్రి చాలా సేపటివరకూ నారప్పదగ్గరే కూర్చుండిపోయాను. తొలిజాము మాటలతో గడిచిపోయింది. మలిజామున జ్వరం తెరలుతెరలుగావచ్చి నారప్పను క్రుంగదీసింది. అర్ధరాత్రి గడచినతర్వాత అతడు చలితో దుప్పటి క్రింద చుట్టలు చుట్టుకుపోయాడు. అంతజ్వరంలో గూడా కుమారుడిపెళ్ళి చుట్టూ పారాడుతున్న అస్పష్టమైన భావలను వ్యక్తంచేయడానికి ప్రయత్నిస్తూ, మాటలు స్ఫురించక, పెదవులు విడివడక, గొంతుక పెగలక అతడు పడుతున్న బాధను చూడలేక ఇవతలికి వచ్చేశాను. తనలోని జీవచైతన్యాన్నంతా కుమారుడిపట్ల ప్రేమగా మార్చుకున్న మానవుడు నారప్ప. 'వాడువినా తనులేడు, వాడితోడిదే తనకు లోకం' అన్నంతగా కుమారుణ్ణి గురించిన తలపులకు తనమనసులో చోటిచ్చి నారప్ప తననుతనే విస్మరించాడు. నారప్పకు సంబంధించినంతవరకూ పుత్రప్రేమ అదొక తపస్సు.

తెల్లవారింది.

లేచి కూచుంటూ లోపలికి చూచాను. మంచంపైన నారప్పలేడు.

గబాలున లేచి పిల్చుంటూ 'నారప్పా, నారప్పా' అని గావుకేక పెట్టేశాను.

"ఇక్కడున్నాను బాబూ! మనం బస్సుకు బయల్దేరొద్దూ ? ముఖం కడుక్కుంటున్నాను... "

ఎలా లేవగలిగాడు నారప్ప! ఇంతదూరం ఎలానడిచి రాగలిగాడు ? జబ్బులో తీసుకుంటున్న మనిషి మంచినీళ్ళతోనా ముఖం కడుక్కోడం ? ఐనా అవెప్పటినీళ్ళు!

"ఇదిగో నారప్పా! నువ్వు కదలకుండా కూర్చోవాలి. ఎవరైనా నీళ్ళుకాచి తీసుకొస్తారు. వేడివేడిగా పాలు త్రాగితే గానీ నీకు ఓపిక చేకూరదు. ప్రయాణంసంగతి ఆతరువాత ఆలోచించుకోవచ్చు" అన్నాను.

నారప్ప నామాటలు వినీవిననట్టు తనపని తాను చేసుకపోయాడు. ముఖం కడుక్కోగానే యింటిలోపలికి వెళ్ళి కట్టుకున్న పంచను విప్పి వుతికిన ధోవతి కట్టుకున్నాడు. 'తాళం ఎక్కడో వుండాలి, చాలారోజులైంది చూచి' అంటూ దీగుళ్ళన్నీ గాలించి చివరకు తాళాన్ని వెదకి పట్టేశాడు.

"ఇక వెళ్దామా బాబూ !" అంటూ ద్వారబంధానికి ఆనుకుని నిల్చున్నాడు.

నిల్చున్నాడే గానీ నారప్ప కాళ్ళు గడగడా వణకిపోతున్నాయి.

రెప్పలుకదలని అతడికళ్ళల్లో ఉన్మాదంలాంటి నీడలు నడయాడుతున్నాయి.

మంచందగ్గరున్న చేతికర్రకోసం అతడు రెండడుగులు ముందుకు వేశాడు.

మూడో అడుగు వేయనేలేదు నారప్ప! ఉప్పు కూరలా ఢభేలున నేలపైన పడిపోయాడు.

క్షణాల్లో పెద్దాచిన్నా ఆడామగా వ్యత్యాసం లేకుండా ఊరంతా నారప్పచుట్టూ ప్రోగయింది. జనాన్ని చీల్చుకుంటూ ఆచార్లుగారు గూడా ఆదరాబాదరాగా వచ్చేశారు.

"మీరంతా మొద్దు పీనుగలు. ఒంటికేదైన వస్తే వైద్యుడు చెప్పినమాట వినాలన్న బుద్ధేవుండదు మీకు! మనిషిస్పృహ

లేకుండా కళ్ళు తేలవేసేస్తుంటే చుట్టూచేరి అతడికి గాలికూడా రాకుండా చేస్తారా మీరు? వెళ్ళండి వెళ్ళండి" అంటూ ఆచార్లుగారు నోరుచేసుకున్న మీదట యిల్లు పలచబడింది.

"దిగాలుపడి నిల్చున్నా రెందుకూ? పట్టండి. మంచం పైకి పట్టండి" అంటూ ఆచార్లుగారు మందులసంచి తెరచి డబ్బీలు పైకి తీయసాగారు.

ప్రేక్షకమాత్రుణ్ణిగా పరిణామా లన్నింటినీ అవలోకిస్తూ, కర్తవ్య మేమిటో తోచక చింతచెట్టు క్రింద నిల్చున్నాను. శుష్కకాష్ఠం లాంటిది నారప్ప శరీరం. అది మళ్ళీ రోగ శయ్యకే అంకితమై పోయింది. మందులూ మాకులూ, మంత్రాలు తంత్రాలు అంటూ ఆచార్లుగారు తమ పాట్లేవో పడుతున్నారు.

సూర్యుడు నడిమింటికి రానూవచ్చాడు. పడమటికి వ్రాలనూ వ్రాలిపోయాడు.

"అగ్నిహోత్రంలాంటిది నాయనా మృత్యుదేవత కడుపు! ఈ సమిధపడితే గానీ ఆ దీ రోజు శాంతించే సూచనలు లేవు" అంటూ దగ్గరికి వచ్చారు ఆచార్లుగారు.

"అంతేనా ఆచార్లుగారూ! కథ ముగిసిపోయినట్టేనా!" అన్నాను.

ఆచార్లుగారు ఒకరిని టెంకాయకోసం రెడ్డిగారి తోటకు వెళ్ళిరమ్మన్నారు. మరొకరిని తులసికోసం పంపారు. వేరొకరిని తమ యింటికివెళ్ళి శ్రీపాదరేణువు తీసుక రమ్మన్నారు.

"ఉన్నంతకాలం వుద్ధరించలేకపోయినా చచ్చిన తర్వాత తలకొరివి పెట్టడం కుమారుడి కనీసపు ధర్మం! వెళ్ళు నాయనా వెళ్ళు. రేపు సాయంత్రానికైనా వా డిక్కడికి వచ్చేటట్టు చూడు. రాగలిగితే మంచిదే. లేకపోతే ఏదో మేము నలుగురమున్నాము. ఈడ్చిపారేస్తాము. ఎందుకైనా నువ్వు త్వరగా వెళ్ళాలి మరి. ఈ వేళప్పుడు బస్సు లుండ వనుకో, ఏదైనా లారీ దొరకవచ్చు నీకు...."

ఎలాగైనా ఆచార్లుగారిది సిద్ధవాక్కు. ఆయన మాట మేరకూ రాత్రి ఎనిమిది గంటలప్పుడు నాకు రోడ్డుపైన ఓలారీ తటస్థపడింది.

బొగ్గుల మూటలపైన కూర్చోగలిగితే తనకేమీ అభ్యంతరం లేదన్నాడు డ్రయివరు.

ఆ రోజు రాత్రి లారీపైన పడక అంపశయ్యలా అమరింది నాకు! ఆకాశంలో నక్షత్రాలు లెక్కబెడ్తూ పడుకున్నాను.

గుడి కనిపిస్తే ప్రదక్షిణం చేసి, దేవుడికి దండం పెట్టుకోకుండా ముందుకు కదల్లేని భక్తుడిలాంటిది ఆ లారీ! అది మార్గమధ్యంలో ప్రతి టీస్టాలు దగ్గరా అరగంటసేపు ఆగిపోతూ వచ్చింది.

తెల్లవారబోతుండగా త్రాళ్ళు పట్టుకొని మెల్లగా క్రిందికి దిగజారాను. ఊరి పొలిమేరలో అడుగుపెట్టేసరికి సన్న సన్నగా సన్నాయిమేళం వినిపించింది. డోళ్ళు ధణధణా మ్రోగిపోతున్నాయి.

రమణారెడ్డి

# విక్రాంతి

[శివాజీ మరణానంతరము మహారాష్ట్రదేశ భాగ్యరేఖ పతనముఖము బట్టియుండినప్పుడు, దానికి ఉచ్చ స్థితిని కల్పించినవాడు పీష్వాబాజీరావు. శివాజీ మనుమడైన సాహూకు ప్రధానియై, మొగలాయి సామ్రాజ్య వృక్షమును పతనోన్ముఖము గావించిన దిట్ట బాజీరావు. మహారాష్ట్రులలో రణోత్సుకతను రగిలింపజేసి, వింధ్యగిరుల కావల మహారాష్ట్ర అధికారప్రాభవమును కృపాణాగ్రముతో స్థాపించినాడు. అతని దండయాత్రను యీ క్రింది గేయము వర్ణించబూనినది. —రచయిత.]

కేతన చేతన లలిత సంచలన
తరళిత తారాపథము
ఆశ్విక సైనిక యానాయాన వి
ఘూర్ణిత ధరణీతలము
శుభ ప్రభాత ప్రభావిత మహా
రాష్ట్ర హృదయ పథము
శాత్రవ ఖాండవ వన దావానల
సదృశము బాజీ మనము.

* * *

పశ్చిమ దిగంతమున
పాణి ప్రమాణమున
ఒక దూది పింజవలె
ఒక యంచ రెక్కవలె
కంటికానని మబ్బు
చంటిపాపని యుబ్బు
శివజటోద్గతి యట్లు
యువభటోద్ధతి యట్లు
దిఙ్మాత్రస్వల్ప మానాడు
దిగ్వ్యాప్తమైన దీనాడు.

పిల్లమబ్బొకటి మెల
మెల్లగా యుబ్బి నల
నల్లగా ప్రబ్బికొని
ఎల్ల మిన్నుల మ్రింగదో ?

జలశూన్య దేశమున
శైల ప్రదేశమున
ఒక పిపీలిక పోలె
ఒక్కకడ కొసరువలె
చూపుకానని మొలక
రూపు నెంచగ పిలక
బహుపాద వృక్ష మట
బాహాశతమ్మట్లు
దిఙ్మాత్రస్వల్ప మానాడు
దిగ్వ్యాప్తమైన దీనాడు.

పిన్న మొలకొకటి నన
సన్నగా తోచి చిన
చిన్నగా లేచి తుది
మిన్నందుకొన బోవదో ?

క్రూరగ్రీష్మాంతమున
దూరగిరి ప్రాంతమున
ఒక పాము మెలికవలె
ఒక తీవ వంపువలె
ఉండియును లేనట్లు
కంటి కందని యట్లు
సర్వతోముఖ మట్లు
ఉర్వి మ్రింగెడు నట్లు
దిఙ్మాత్రస్వల్ప మానాడు
దిగ్వ్యాప్తమైన దీనాడు.

బడుగు వాగొకటి అడు
గడుగునకు బలిసి కడు
బెడిదంపు తోరమై
వడివడిగ సుడి దిరుగదో ?

*　*　*

రోకటి పోటందిన రో
లొకటి రోకలై నది;
సమ్మెట వ్రేటందిన ఒక
దిమ్మె సమ్మెటైనది;
వామనుడు త్రివిక్రముడై
దమితము దమియైనది;

ఓడలు బండ్లై బండ్లే
ఓడలైన విప్పుడు !

*　*　*

తురగము లొకనది తరగలెగసినటు
తెరల తెరల కెంధూళి తెరలినటు
పంట పొలముపై పడమటిగాడ్పటు
వంకర నడకల విషోరగములటు

వింధ్య సాత్పురా పర్వతపంక్తుల
నర్మద తపతీ నదీతీరముల
మాళవ ఘూర్జర బుందేల్ సీమల
రాజపుత్ర బహుసంస్థానంబుల

యమునాతటిపై చర్మణ్వతిపై
ఆరావళిపై ఆబూగిరిపై
ఎల్లెడ తామై ఎల్లెడ జయమై
మహారాష్ట్రులటు పరాక్రమించగ

చనె విరికారులు చనె మిట్టిండలు
చనె తొలికారులు చిత్తరి చలియును
చనినది దేశపు శాంతియు సౌఖ్యము
చని సామ్రాజ్యపు కాంతియు గర్వము.

("మధుస్వప్నము" చతుర్థ తరంగమునుండి)

సుప్రసన్న

# సంస్కృతరూపకముల అనువాదములు - 1

సంస్కృతరూపక సాహిత్యము సర్వతోముఖముగ ఉజ్జ్వలమయిన సంస్థితిని పొందినది. ఆ మహా సాహిత్యమును కాళిదాసభవభూతులు మహోజ్జ్వలముగ ప్రకాశింపజేసినారు. గ్రీకు రూపకముల కించుక తరువాతనో, సమకాలికముగనో వెలసిన యీ రచనాప్రక్రియ శాఖోపశాఖలుగ విస్తరించినది. భరతాదులు దీనిలక్షణము చెప్పిరి. ఈ రూపక సాహిత్యసంపద తెలుగుభాషలో నెట్లు వెలసినదో, దానియొక్క సౌందర్యము నెట్లు సమకూర్చుకొన్నదో విచారింపవలయును.

ఒక విచిత్రమైన పరిస్థితి యేమనగా సర్వతోముఖముగ విస్తరించిన ఈ రూపకము భారతీయ భాషలలో ఏ భాషలోను గత శతాబ్ది వరకు రానేలేదు. సంస్కృతమునుండి సర్వసాహిత్య ప్రక్రియలును ఎరవుతెచ్చుకొన్న మన భాషలు ఏలనో రూపకప్రక్రియను సాధింపలేదు. అస్సాము భాషలోమాత్రము 'అంకియావాట్' అను రూపక ప్రక్రియ కొంచెము ముందుగనే వెలసినది. ఇది సుష్ఠురూపక రచనతో పోల్ప వీలులేనిది.

ఇతిహాసము, కావ్యము, వచనకృతి మొదలైన రచనలన్నియు సంస్కృతభాషలోనివే. సర్వభారతీయ భాషారచయితలును ఆ మార్గమునే అనుసరించిరి. రూపకరచనయే కాక రూపకమీమాంస కూడ సంస్కృతమున విపులముగ చేయబడినది. పెక్కురాలంకారికులు రూపకమునుగూర్చి ప్రత్యేకముగ విచారణచేసిరి.

ఈ భాషలలోని పూర్వరచయితలకు సంస్కృత నాటకములతో పరిచయము లేదని చెప్పుటకు వీలులేదు. చాలమంది ప్రసిద్ధములైన కాళిదాసాదుల రచనలను చదివిరి. వానిలో కొన్ని తమభాషలోనికి కావ్యస్వరూపమున పరివర్తనము చేసుకొనిరి. సంస్కృతమునుండి కావ్యములుకూడ మనభాషలో ఎక్కువగా అనువదింపబడలేదు. దశకుమార చరిత్ర, నైషధము తప్ప కుమారసంభవాది కావ్యములన్నియు నట్లేయున్నవి. ఇట్లు కావ్యములు విరివిగా అనువదింపబడకపోయినను కావ్యప్రక్రియ ప్రబంధరూపమున మనభాషలో వెలసినది.

నాటకములు పూర్వకాలమున మనభాషలో రచింపబడకపోవుటకు కారణములను పండితులు పలురకములుగా నూహించుచున్నారు. పందొమ్మిదవ శతాబ్దము వరకును దేశములో నాటకములు ప్రదర్శించువారు లేకపోయిరి. ముస్లిముల పరిపాలనలో స్థైర్యములేని మనసమాజములో నాటకముల రచన వీలులేకపోయినది. ఆనాడు సమాజములో నటులకు సరియైనగౌరవము లేకుండెను. ఈమధ్యకాలమున పాశ్చాత్యదేశీయ నాటకనటులు, తత్ప్రదర్శనములు చూసినగాని మనలో పునరుజ్జీవనము కలుగలేదు. ఇవి వీరుచెప్పు కారణములు. ఈ కారణములన్నియు సంతృప్తికరములుగా లేవు.

నేను మరికొన్ని కారణముల నూహించుచున్నాను.

భారతీయ భాషలన్నియు దాదాపు పదవ శతాబ్దముననే కావ్యస్వరూపమును పొందినవి. రూపకమందు వాడుభాష చాలశక్తిమంతమైనది. కావ్యాదులయందు ప్రయుక్తమగు కథాత్మకమైన భాషకు సంవాదాత్మకమైన నాటకీయభాషకును చాల భేద

మున్నది. ఈ భాషలయందలి యభివ్యక్తీకరణశక్తి అంత యభివృద్ధిచెందలేదు. సంస్కృతభాష రూపక నిర్మాణచణమగుటకు కొన్ని వేల యేండ్లుగా పెరిగినది.

సంస్కృతరూపకము లన్నియు ప్రదర్శనమున కుద్దేశించి రచింపబడినవి. మనదేశములో పెద్ద సామ్రాజ్యము లేకపోవుట, అస్థిరములైన చిన్న చిన్న సామ్రాజ్యములు నాటక సమాజములను పోషింపలేకపోవుట కారణములు కావచ్చును. ఏది ఏమైనను ఈ నాటకసమాజ నిర్మాణము విజయ నగర సామ్రాజ్య కాలములో జరుగవలసినది. శ్రీ కృష్ణదేవరాయలవారి కాలమున సంస్కృత నాటకములు ప్రదర్శనముపొందినట్లు చరిత్ర చెప్పు చున్నది. ఈ కాలమున తెలుగులో నాటకములు బయలుదేరకుండుటకు కారణము రాయల జీవితము లోని ఎక్కువభాగము యుద్ధములందే గడచుట కావచ్చును. బహుభాషా సమ్మేళనముగల రాజ్య మున సమాజమువారు సంస్కృతనాటక ప్రదర్శ నమే చేయుచుండిరేమో!

ఒకవేళ సంస్కృతరూపకములే అనువదించి ప్రదర్శింతమన్నను వారిప్రదర్శనకు తగిన పరికరము లీకాలములోని నటుల కందుబాటులో లేకపోయి యుండును. ప్రజలలో విద్య తక్కువ యగుటచేత వీనిని చూచువారు నాడు లేకపోయిరేమో! వారి యానందముకొరకు యక్షగానములు,తోలుబొమ్మ లాటలు, భాగవతములు మొదలైన వినోదము లుండెను.

తెలుగువారు సంస్కృతరూపకములురచించిరి. రత్నపాంచాలిక సర్వజ్ఞసింగభూపాలునిది. వామన భట్టబాణునిది పార్వతీపరిణయము. విద్యానాథు డింతకుపూర్వమే నాటకలక్ష్య లక్షణములను నిరూ పించెను. కాటయవేముడు కాళిదాస నాటకత్రయ మునకు వ్యాఖ్యానము రచియించెను. మహా విద్వాంసుడైన శ్రీనాథుడు కూడ నాటకరచనకు పూనుకొనలేదు.

కొందరు వినుకొండ వల్లభరాయని క్రీడాభి రామమే తొలి తెలుగు రూపకమనుచున్నారు. ఇది రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామమునకు తెనుగుసేత. ఈ తెనుగుసేతకును మూలమునకు నెట్టి సంబంధమున్నదో మనము మూలము లభించ నందున నిరూపింపలేకున్నాము. దీనియందు వీధి రూపకలక్షణ మెంతవరకు పట్టునో తెలియవలెను.

తెలుగులోని పూర్వ సాహిత్యములోని రూపక ములు లేకుండుట గూర్చి ఇట్లెన్నియో కారణము లూహింపవచ్చును. ఇవన్నియు ఊహామీదనే ఆధార పడియున్నవి. వీనిని మరొకరు కాదనవచ్చును.

పూర్వాంధ్రసాహిత్యములో మన కొన్ని కావ్య ములు ప్రాచీన సంస్కృత నాటకముల కనువాద ములైయున్నవి. వీనియందు దృశ్యకావ్యము యొక్క బహిస్స్వరూపమే మారిపోయినది. ఇట్టి వానిలో మనకు మొదట కనిపించునది విద్ధసాల భంజికకనుకృతియైన కేయూరబాహుచరిత్రము. దీనిని మంచనకవి రచించెను. పిల్లలమఱ్ఱి పినవీర భద్రుడు అభిజ్ఞాన శాకుంతల మాధారముగా శృంగార శాకుంతలమును రచియించెను. నంది మల్లయ, ఘంటసింగయ అను కవులు ప్రబోధ చంద్రోదయమును ప్రబంధముగా వెలయించిరి. పారిజాతాపహరణము రచియించుటకు ముక్కు తిమ్మన యొక సంస్కృతనాటక మాధారముగా గ్రహించెను. అనర్ఘరాఘవమును పదునేడవశతాబ్ద మున తిమ్మకవి, వనపర్తిరాజా అష్టభాషా బహిరీ గోపాలరాయని బంధువొకరు, కూచి సత్యనారా యణకవి యనువారు కావ్యములుగా రచించిరి విక్రమోర్వశీయమును శ్రీ శేషాద్రిరమణ కవులు ప్రబంధమొనర్చిరి. ఇట్టి పరివర్తనము లెన్నియో మనము పేర్కొనవచ్చును.

ఇవన్నియు కేవలానువాదములు కావు. మూల కవి యొక్క ప్రతిభ, అనువాదకుని ప్రతిభ వీని యందు సమానాంతరముగ ప్రవహించుచుండును. ఇవన్నియు మూలాపిధేయములైన కృతులే.

కొన్నిచోట్ల వ్యాఖ్యానరూపముగ, కొన్నిచోట్ల విస్తరరూపమున ఔచిత్య దృష్టితో, ప్రధానాప్రధాన వివక్షతో నివి రచింపబడును. నాటకములలోవలె వాక్యోపవాక్యరచన కావ్యములో జరుపవీలులేదు. కావ్యములలో ఒకరు సుదీర్ఘముగ మాట్లాడిన తరువాత గాని వేరొకరు మాట్లాడరు. అందువలన అనువాదకుడు తన యిష్టమువచ్చినంతగా పెంచవచ్చును. నాటకములయందు సూచ్యములైన కథావస్తువులను కావ్యకర్త ప్రత్యక్షీకరింపవచ్చును.

ఉదాహరణకు శాకుంతలములోని "అసంశయం క్షత్రపరిగ్రహక్షమా,.." శ్లోకమునకు పిల్లలమఱ్ఱి ఎట్లనువదించినాడో చూడవచ్చును.

సందియమేల యీ వికచ
సారసలోచన రాజపుత్రి నా
డెందము మౌనికన్యలఁబడిం
జననేరదు నిక్కువంబ, యే
చందమునందు సంశయ
విచార పదంబగునట్టి వస్తుసీ
మం దమచిత్తవృత్తులు
ప్రమాణము లుత్తములైనవారికిన్.

పౌరవ వంశసంభవుల
పావనచిత్తవిధంబు లన్యకాం
తారతికిం బ్రమోద భరితం
బులుకావు ప్రకంపమొంది యీ
ధారుణి సంచరించినను
దామరచూలి వరంబుతప్పినన్
వారిధులింకినన్ మఱి
దివాకరచంద్రులు తప్పగ్రుంకినన్.

రెండవపద్యము తెలుగుకవిది. ఇది వ్యాఖ్యాన మార్గము. దీనిలోని రమణీయతారమణీయతలు చర్చనీయములు కావు. ఈ అనువాద కావ్యములందు మూలములోని వ్యంజనాశక్తి దెబ్బతిన్నదని యొప్పుకొనక తప్పదు. ఇవి చాలవరకు ప్రబంధములవలెనే నిర్వహింపబడినవి. ఇవి సంస్కృత నాటకముల యంత రమణీయములు కావు. మూలములోని భావములకు అందముకూర్చిన ఘట్టము లసలే లేవని చెప్పలేము.

నన్నయ్యగారినుండియే ఈ సంస్కృతరూపకముల ప్రభావము మన కావ్యములమీద వ్యాపించియే యున్నది. పూర్వులైన తెలుగుమహాకవులందరును సంస్కృత రూపకములను బహుపర్యాయములు మననముచేసుకొన్నవారే. నన్నయ్యగారి శకుంతలోపాఖ్యానమున కాళిదాసు తొంగిచూచుచున్నాడు. అసంశయేత్యాది శ్లోకమే "ఇది మునికన్యయేని మఱి యేలొకో యీలలితాంగియందు నా హృదయము దద్దయుందవిలె" ఇత్యాది పద్యమునకు మూలము.

మన కావ్యవిమర్శలో నాటకీయశిల్పమనున దొకమార్గము. ఈ శిల్పము తిక్కనగారి భారతములో ఎక్కుడుగా ప్రదర్శితమైనదని కొందరు చెప్పుదురు. ఈ శిల్పమన నేమియో నెవ్వరును విస్పష్టమైన నిర్వచనము చేయలేదు. నాటకముల లక్షణములలో చెప్పబడిన పంచసంధులు, తత్స్వభావమైన వాక్యోపవాక్య రచనయే ఈ శిల్పమని వీరి యభిప్రాయము. ఇవి కావ్యలక్షణములును.

సంస్కృతములోని మహాకావ్యములలో వస్త్వైక్యము చాలవరకు పాటింపబడలేదు. తెలుగు ప్రబంధములలో నాటకములలోవలె వస్త్వైక్యము, బీజబిందుపతాకాది లక్షణములు ప్రచురములుగా నున్నవి. పారిజాతాపహరణ వసుచరిత్రము లిట్టి విలక్షణమైన శిల్పలక్షణమున కుదాహరణములు. వసుచరిత్రలో వసురాజు గిరికాదేవి ముందు ప్రవేశించుట మున్నగు ఘట్టములు శాకుంతలములోని దుష్యంతప్రవేశాదిఘట్టములతో పోల్పదగియున్నవి. రామరాజభూషణుని రచనపై కాళిదాస ప్రభావమెంతయో కానిపించును. ఈ లక్షణములనిర్వహణమునవే మన ప్రబంధములలోని కథ ఒక క్రమమున నభివృద్ధిచెందినది. నాటకీయశిల్పమార్గములు కావ్యమునకు మరింత శోభాహేతువులైనవి.

ఇట్టి గొప్ప నాటకములు మన భాషలలో గత శతాబ్ది వరకు అనువాదము పొందలేదు. గత శతాబ్దిలో మన సాహిత్యరంగములో కలిగిన పునరుజ్జీవన మన్ని రంగములతో బాటు నాటకరంగమున కూడ ప్రవేశించినది. మహారాష్ట్ర దేశమునుండి వచ్చిన ధార్వాడ నాటకసమాజమువారు మదరాసునుండి ఆంధ్రదేశము కూడ పర్యటించిరి. తెలుగుదేశము వారి నాటకముల చూచి ఊగిపోయినది. హార్మోని యంతబలాలతో చమ్కీకోటుల తళతళలతో వారి నాటకములు తెలుగుదేశమును సమ్మోహింప జేసెను. ఈ కాలము 1880 ప్రాంతము.

అప్పుడే మనదేశములోని పండితులలో అధునాతన నాగరకతా సంస్కారము మార్పు తీసికొని వచ్చుచుండెను. పాశ్చాత్య విద్యావిధానమువలన మనదేశీయులకు పాశ్చాత్యరూపకములతో పరిచయ మేర్పడెను. ఆ రూపకముల ప్రదర్శన చూచి, విని మనదేశములో కూడ నాటకములు ప్రదర్శింప వలయునన్న ఉత్సాహము వారికి కలిగెను.

ఈ సమయములో శ్రీ కందుకూరి వీరేశలింగం గారు శ్రీ హర్షుని రత్నావళిని, షేక్స్పియరు రచించిన 'కామెడీ ఆఫ్ ఎరర్స్' ను గబగబ అనువదించిరి. ఈ నాటకము లప్పుడే రాజమహేంద్రవరమున ప్రదర్శింపబడినవి. తెలుగుదేశములో తొలి నాటకసమాజము స్థాపించినవారు శ్రీ వీరేశలింగము పంతులుగారే.

వీరేశలింగముపంతులుగారే తొలితెలుగు నాటక కర్తలు కారు. వారే తొలిఅనువాదకులును కారు. ఇంతకుపూర్వమే కొన్ని సంస్కృతరూపకము లనువదింపబడినవి. ధార్వాడ నాటకసమాజముల వార ప్రదర్శన మొకటి, పాశ్చాత్య నాటకములు చదువుటవలన మనదేశము వారిలో కలిగిన స్వదేశాభిమానము రెండు, వీనివలన ప్రేరణపొంది ఆంధ్రదేశములోని చాలమంది పండితులు పరస్పరము స్పర్థతో సంస్కృతములోని ప్రసిద్ధరూపకములు చాలవర కనువదించిరి. వీనిలో చాలవరకు ప్రదర్శన కుద్దేశించినవే. ఇట్లు ప్రేరణపొందిన వారిలో శ్రీయుతులు కొక్కొండవారు, వడ్డాది వారు, దాసు శ్రీరాములు, వేదంవారు మొదలైన వారు ముఖ్యులు.

మూలరచనకు అనువాదమునకు భేదమున్నది. ఈ అనువాదమన్నది ఒక భాషలో ఒకానొక కవి రచించిన కృతిని వేరొకభాషలో రచించుట. ఆ భాషారచయిత యొక్క రచనా ప్రాశస్త్యమును తన భాషాజనులకు తెలియజేయుట, ఆ భాషలోని వ్యక్తీకరణలోని వైచిత్రిని తన భాషయందు తెచ్చుకొనుట.

ఒక గ్రంథము రచించు కవికన్న అనువాదకునకు ఎక్కువ బాధ్యతలు ఉన్నవి. అనువాదకుడు మూలకర్త యొక్క భాష యెడల, నానుడుల ఎడల, శైలీస్వభావముల యెడల విధేయత కలిగియుండ వలయును. తానే గ్రంథము ననుసరించి వ్రాయుచున్నాడో దానియొక్క సొగసు చెడరాదు. దానిని తన భాషలో తగినంత స్వాతంత్ర్యముతో రచింపవలయును. మూలగ్రంథముయొక్క ఉద్దేశ్యమునకు భంగము కలుగరాదు. మూలగ్రంథమున్న భాషలో లోతైన భావగ్రహణశక్తి, అనువదించు భాషలో సుందరమైన అభివ్యక్తీకరణశక్తియు అనువాదకున కవసరము. తన పాండిత్యము స్ఫురింపజేయు ప్రయత్నము చేయరాదు.

సంస్కృత రూపకములు మన భాషలో ఏబదిపైగా అనువదింపబడినవి. వీని యనువాదముల సంఖ్య రెండువందల కెక్కువయే. ఇంకను మరి కొన్ని చేరవచ్చును. కొన్ని నాటకములు ముప్పది పర్యాయములకుపైగా రచింపబడినవి. ఇవన్నియు రూపకస్వరూపమున వచ్చిన యనువాదములు. కావ్యకథా నవలాదిరూపమునవచ్చిన అనువాదములకు లెక్కయేలేదు. ఇవన్నియు ఉత్తమములైన యనువాదములుగా మనము చెప్పలేము. కాని ఒక్కొక్క అనువాదకుడును తనకుతాను పూర్వానువాదముల యందలి లోపములను పూరించుటకే

అనువదించుట కారంభించెను. ఈ ప్రయత్నములోని చిత్తశుద్ధిని మనము శంకింపలేము.

అందువలననే ఈ అనువాదములం దనేకము లైన భేదము లేర్పడినవి. కొన్నికొన్ని యనువాదములు మూలవిధేయములు. కొన్ని మూలావిధేయములు. కొన్ని మూలవ్యాఖ్యానములు. ఈ మార్గము లన్నింటియందును గుణములతోబాటు దోషములు కూడ నున్నవి.

కొన్ని యథామాతృకానువాదములు. వీనిలో మూలమునందున్న ప్రతి యర్థము, శబ్దము కూడ అనువాదమునం దుంచబడును. సంస్కృతభాషకు తెలుగుభాషకున్న సంబంధమును పురస్కరించుకుని ఆ భాషలోని శబ్దములన్నియు—ఎంత ఎంత సమాసములైనను—మన భాషలో డు, ము, వు, లతో ప్రవేశించినవి. ఈ పద్ధతికి శ్రీ వేదంవారి యనువాదముల నుదాహరణములుగా స్వీకరింపవచ్చును.

కొన్ని వ్యాఖ్యానానువాదములు. ఇవి రచయితను మన భాషలో ప్రకాశింపజేయు ప్రయత్నములు. మూలములకు విధేయములైనను దానిలో సూచ్యములైనచోట్ల వ్యాఖ్యానము చేయుచోట్లు. శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారి భాసనాటకానువాదము లీ మార్గమునందలివే. ఈ మార్గము కవియొక్క ఆశయమునకే ఒక్కొక్కచోట భంగము కలిగించును. వ్యంజన ద్వారా కవి సాధించినదానిని వాచ్యముచేయుట ఇందలి దోషము.

మరొకటి కథామాత్రానువాదము. ఇది మూలమునందలి కథమాత్రమే స్వీకరించి, తన యిచ్చవచ్చినట్లు నాటకము రచించుట. ఈ రచనయందు అనువాదకు డసంపూర్ణస్వేచ్ఛ వహించును. అనువాదకుని ప్రతిభ పిస్తరించు నవకాశమిందున్నది. ఈ మార్గము గ్రంథములు శ్రీ కంచనపల్లి జగన్నాథరావుగారి మాలతీమాధవము, బలిజేపల్లి వారి ఉత్తరరాఘవము మొదలగునవి.

ఇంకొకటి మూలములోనున్న కవియొక్క శక్తినంతను అనువాదకుడు తన భాషలో రాబట్టు ప్రయత్నము చేయుట. ఈ మార్గ ముత్తమమైనదే. ఈ కవియొక్క శిల్పశక్తి యిట్టిదని మనము నిర్ణయించుటకష్టము. ఊహాలో కథలోచేసిన సౌందర్యమును రాబట్టవచ్చును కాని శబ్దమునందు, శబ్ద సంయోజనమందు చేసిన శిల్పమును మనము రాబట్టలేము.

కొందరి అనువాదములు మూలమును రంగస్థలానుకూలముగ నొనర్చునవి. వీనియందు ప్రాచీన కాలమునాటి రంగమునకు, నేటి రంగమునకు నడుమ కలిగిన పరిణామము నుద్దేశించి అమార్పునకు తగినట్లుగా అంకములు మార్చుట, రంగములు వ్రాయుట, విష్కంభాదులను తీసివేయుటమున్నగునవి చేయబడును. చివుకుల శ్రీరాములుగారి శాకుంతలము మొదలైన విట్టివి.

మరికొన్ని అనువాదములు పాశ్చాత్యనాటక ప్రభావమువలన సంపూర్ణముగ గద్యములుగ రచింపబడుచున్నవి. నాటకములలో వాస్తవికత నుద్దేశించి మనము నిత్యజీవితములో పద్యములు పాడము కనుక పద్యముల స్థానమునకూడ వచనమునే రచించి సంపూర్ణ గద్యరూపకములుగా వీనిని నిర్మించుచున్నారు. నాటకములలో శ్లోకములకు బదులుగా పాటలు రచించుచున్నారు కొందరు. ఇదంతయు నాటకముయొక్క స్వరూపమున వచ్చిన మార్పుమాత్రమే.

ఈవిధముగ నాటకముల అనువాదములలో మన రచయితలు వివిధములైన మార్గముల ననుసరించియున్నారు. ఈ యనువాదములలో ఒక్కొక్క దృష్టితో చూచినప్పు డొక్కొక్క ప్రయత్నము బాగుగా కనిపించుచున్నది. ముఖ్యముగా మూలకర్త కన్యాయము జరుగనంతవరకు మనమీస్వేచ్ఛ నంగీకరింపవచ్చును కాని మూలమునకు దెబ్బవచ్చినప్పుడు మాత్రము మనమాపద్ధతిని తిరస్కరించవలయును.

'అధునికాంధ్రవాఙ్మయవికాసవైఖరి' లో శ్రీ జయంతి రామయ్యపంతులుగారు సంస్కృత రూప

కములను తెలుగులోనికి పరివర్తించుటగూర్చి ప్రస్తావించిరి. అందు వారు మూలమును శబ్దములనుండి యథాతథముగ తెచ్చుట యొక మార్గమనియు, తెలుగుభాషాసంప్రదాయానుసారముగ రచించుట వేరొక మార్గమనియు తెలిపిరి. మొదటి మార్గమునకు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు, రెండవ మార్గమునకు శ్రీ కందుకూరి వీరేశలింగము పంతులుగారు ప్రతినిధులు. జయంతివారు రెండవ మార్గమునే బలపరచిరి. ఈ అభిప్రాయమునే వారు తమ ఉత్తరరామచరిత్రాంధ్రీకరణమున తెలిపిరి.

కందుకూరివారు తమ శాకుంతల పీఠికలో "అప్పుడు మొదటి రెండంకములు కఠినశైలిలో వ్రాసినను నాటకమాడునప్పుడందరకును తెలియుట యత్యంతావశ్యకమను నభిప్రాయముతో నిప్పుడీ యైదంకములు మిక్కిలి సులభముగా వ్రాసినాడను" అని తెలిపినారు. కందుకూరివారికి సామాజికుని పైననే ప్రాధాన్యము. నాటకానువాదమునకు నాటకప్రదర్శనము ముఖ్యాశయము. శ్రీ వేదంవారు కొక్కొండవారి ప్రసన్నరాఘవాంధ్రీకృతినివిమర్శించుచు పెద్దగ్రంథమొకటి రచించిరి. అదంతయు దోషోద్ఘాటనమే ప్రధానమైనది. అనువాద విధిని గూర్చి వారేమియు చప్పలేదు.

శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు ముళ్ళపూడి నారాయణశాస్త్రిగారి శాకుంతల పీఠికలో, "సంస్కృతభాషలో బహుశబ్దములు ధాత్వర్థనిరూపకములై యుండును. తెలుగు నానుడులు, లోకోక్తులు, లోకవ్యవహారరమ్యతా ప్రసాదకములు... కొన్నికొన్ని చోట్ల వట్టి శబ్దమాధుర్యము చేతనే రమణీయార్థ పోషణము కాళిదాసు చేసినచోట్ల శాస్త్రిగారు భావము మాత్రమే గ్రహించిరి.... నిజమునకు మూలములోని శిల్పము ధ్వనులు మొదలైన మహాగుణములు తెలుగునేసెడివాని చేతలో చెడవు. అందందలి స్వల్పాలంకారములు, స్వల్పార్థములు చెడవచ్చును. అట్టివిగూడ లేకుండ తెలుగుసేయుట యసంభవము" అని తెలిపినారు ప్రధానశిల్పము నెడల జాగ్రత్త వహించుట, సంస్కృతమున కేవలము వ్యుత్పత్త్యర్థమున సాధించినదానిని తెనుగున నానుడిద్వారా సాధించుట అధిక రమణీయమైన భావనను సాధించుటకొరకు అల్పమైన మాధుర్యాదిగుణములు వదలివేయుట అనువాదకునికి తప్పవని వారి ఆశయము.

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిట్లు చెప్పిరి. "మక్కికి మక్కి పరివర్తనము చరిత్రదృష్టి కలవారికి, అదితప్ప వేరుదృష్టి లేనివారికితప్ప తక్కిన వారికి నిష్ఫలమైన బరువు. ఈ పరివర్తనము కేవల మాధునికమైన ఆంగ్ల సాహిత్యపు సహవాసముచే మనకు దాపురించినదేకాని ప్రాచీను లిట్టి దాస్య మెరుంగరు. మూలగ్రంథ మహత్వము మరుగుపడుట, అందలిలోపము లనావశ్యకముగా ప్రకటింపబడుట, భాషాంతరీకర్త స్వత్వము పూర్తిగా నంతరించుట యను త్రిదోషములు ప్రాప్తమగును." వీరు మూలావిధేయమైన యనువాదమునే బలపరచిరి. ఇది సమంజసమైన యభిప్రాయముకాదు. ఈ అనువాదకుడు స్వతంత్రముగా గ్రంథము రచించుకొనుట మంచిది. శతావధానులు బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు 18-12-1940 నాటి ఆంధ్రపత్రిక (వారపత్రిక) లో 'మా ముద్రారాక్షసము' అను తమ యనువాదమును గూర్చి చర్చించిరి.

అనువాదమందు విశృంఖలత్వము పనికిరాదు. అనువాద మెట్లుండవలయునో మనమిట్లు నిర్ణయింపవచ్చును. 1. సంస్కృతమున కవి రచించునప్పుడే ఉద్దేశ్యముతో ఈరూపకములు రచించెనో ఆ ఉద్దేశ్యమునకు అనువాదమున భంగము కలుగరాదు. 2. జ్ఞాతశిల్పియైన కవి యుద్దేశించిన శిల్ప సంబంధ రహస్యముల నెరిగి వానిని యనువాదమునందు తెప్పించుటకు ప్రయత్నింప వలయును. సంస్కృతమున ఒక్కొక్క కవి యొక లోకోత్తరమైన శక్తి కలవాడు. ఒక దర్శనంగ్రహణశీలి, ఒకని శబ్దములకూర్పు అతిలోకమైనది. ఒకని వృత్త రచనమే

చమత్కారమైనది. ఈరహస్య మనువాదకునికి తెలియవలెను. 3 మూలకవియొక్క కల్పనలు అనువాదమున యథాతథములుగ కాన్పించవలయును. విస్తరణపనికిరాదు. వ్యాఖ్యానమౌచిత్యభంగకారి కారాదు. 4. భారతాదులలోవలె నిష్టము వచ్చినట్లు కొన్నిఘట్టముల స్వీకరించి, మరికొన్ని స్వీకరింపకుండ నుండరాదు. ఇతిహాసములు విశ్వజనీనములు. వారి యనువాదమార్గము వేరు. ఇవట్లు కావు. ఔచిత్య పూర్ణములైన మార్పులు కథయందు నాటకకర్తలే చేసిరి. 5. మూలములోని భాషఎట్టిదో, అనువాదములోనిభాష అట్టిదో అంత కన్న సారళ్యముకలదో అయియుండవలయును. మూలమున్నకాని యర్థము కానంత క్లిష్టత యనువాదమున కాపాదింపరాదు. మూలములోని వాక్యరచన, భాషాసంబంధి చమత్కారము లనువాదములలో వదలివేయుట దోషముకాదు. వృత్తసంబంధ యౌచిత్యముకూడ పాటించుట మంచిది. 6. రంగస్థలమున కనుకూల మగునటుల వేషభూషాదుల గురించి, హావభావముల గూర్చి సూచనలు చేయవచ్చును. ప్రదర్శనమునకు సూచనలు చేయవచ్చును. పాత్రోచితభాష ప్రవేశపెట్టవలెను. దీనివలననే సామాజికులలో రసస్ఫూర్తి కలుగు నవకాశము కలదు. 7. మూలములో వచనములో నున్న రసవత్తరములైన భావములను పద్యములుగ మార్చవచ్చును. ఇదిగాక కేవలము చప్పగానున్న శ్లోకములను వచనముగ మార్చవచ్చును. పాఠాంతరముల చూచి శుద్ధపాఠమేదో జాగ్రత్తగా నిర్ణయించుకొనవలయును. 8 పాఠకునకు తాను చదువునది ఏ కాళిదాసు నాటకమో యన్న ఊహ కలుగవలయును కాని ఏ వీరేశలింగముగారి గ్రంథమోయన్న ఊహ కలుగరాదు.

ఇవి యనువాదముల కుండవలసిన స్థూలలక్షణములు. ఇవి లేనిచో దాని ననువాదమనకుండుట మేలు.

తెలుగులో అనువాదమైన తొలి సంస్కృత రూపక మేదియనుటలో భేదాభిప్రాయములున్నవి. శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు రచించిన నరకాసుర విజయ వ్యాయోగము 1872 లో ప్రచురింపబడినది. ఇది తొలి అనువాదమని పరిశోధకులు తలచువారు. కాని మధుకరీ మంజరీయమురచించి ప్రథమాంధ్రనాటకకర్తలైన శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రిగారే రూపకానువాదకులలోను ప్రథములని శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారు నిరూపించియున్నారు. వీరు తొలుదొల్త వేణీసంహారము ననువదించిరి. కాని రామచంద్రశాస్త్రిగారి అనువాదప్రతులిప్పుడలభ్యములు. శ్రీ కొక్కొండవారి రూపకమే ఇప్పుడు మనకు లభ్యములైన అనువాదరూపకములలో తొలుదొల్తటిది.

దాదాపు తొంబదేండ్లుగా సాగుచున్న ఈ అనువాదములన్నియు నొకేవిధముగా నుండుటకు వీలులేదు. వీనిలో కాలానుగుణములైన మార్పులు తప్పవు. వైయక్తికములైన ప్రత్యేకతలు ఎట్లును తప్పవు. ఈ అనువాదములను మనము క్షుణ్ణముగా పరిశీలించినచో మూడు దశలుగా విభజింపవచ్చునని తోచును. మొదటిదశ (1860-1900) రెండవదశ (1900-1925) మూడవదశ (1925-తరువాత). ఈ మూడుదశల యందును కొన్ని సామాన్యలక్షణములున్నవి. ఒక కాలమునకు చెందిన లక్షణములు గల రూపకములు వేరొక కాలమున వచ్చియుండవచ్చును. అది వేరుసంగతి. ఈ విభాగము కేవలానువాద నాటకములకే కాని తెలుగు నాటకముల కన్నింటికి వర్తింపదు, మన సాహిత్యరంగములో కలిగిన మార్పులు నాటకములపైనను విస్పష్టముగ గోచరించును.

ఈ దశలలో మొదటిదశ చాల ప్రధానమైనది. ఈ కాలమున అందరును దిగ్దంతులవంటి పండితులు వీరిదృష్టి నిస్స్వార్థమైన భాషాసేవ. తెలుగు భాషలో నాటకములు లేవని విపరీతమైన వేదనను

పొంది. తమ భాషలోనికి ఇతర భాషలలోని సౌందర్యమును తెచ్చిపెట్టుటకు ఇంగ్లీషునుండి సంస్కృతమునుండి అనువాదములు సాగించిరి. ఇది ప్రయోగకాలము. అందువలన లేనిమార్గమును నిర్మించి దానియందు ప్రయాణము సాగింపవల యును. తెలుగుభాషలో ఈరూపకములు జన రంజకములగుట కొక్కొక్క రొక్కొక్క మార్గము ననుసరించిరి. శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి గారు, శ్రీ వావిలాల వాసుదేవశాస్త్రిగారు, శ్రీ కొక్కొండ వేంకటరత్నం పంతులుగారు, శ్రీ వడ్డాది సుబ్బారాయుడు గారు, శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు మొదలైనవారీ దశకు చెందిన రచయితలు.

వీరు సంస్కృతములోని ప్రసిద్ధములైన రూప కములు చాలవరకు అనువదించుట పూర్తిచేసిరి. శాకుంతలము, ఉత్తరరామచరిత్ర, వేణీసంహారము, మృచ్ఛకటిక, ముద్రారాక్షసము, రత్నావళి, మాళవిక, విక్రమోర్వశీయము మొదలైన ప్రసిద్ధ రూపకములేకాక నరకాసురవిజయ ధనంజయ వ్యాయోగములు, ఉన్మత్తరాఘవ నాగానందా దులు కూడ అనువదింపబడినవి. వీనిలో కొన్ని మాత్రము అముద్రితములుగనే నిలచిపోయినవి.

ఈ అనువాదములన్నియు యథాతథములైన అనువాదములే. మూలాతిక్రమణ మేమాత్ర మోర్వనివి. వీరేశలింగము పంతులుగారు మూల మున ప్రాకృతమున్నచోట గ్రాంథికమునే వాడిరి. కాని ఈ స్థలమున శ్రీ కొక్కొండవారు అచ్చతెలుగు వాడిరి. ఈ మార్గమునే శ్రీ పరవస్తు రంగా చార్యులుగారుకూడ అనుసరించిరి.

ఆనాటి తెలుగుభాషలోని వచన స్వరూపము వేరు. చిన్నయసూరి నీతిచంద్రికయే నాటి వచన రచనకు ప్రామాణికము. అందువలన ఆ రీతికిచెందిన వచనమే శ్రీ కోరాడ రామచంద్రశాస్త్రి, శ్రీ పరవస్తు రంగాచార్యులు, శ్రీ కొక్కొండ వేంకట రత్నం పంతులు మొదలైనవారి రూపకముల యందు గోచరించును. ఈనాటికీ భాష అసహజ ముగ గోచరించినను ఆనాడీభాష తప్పదు. ఆధునిక వాఙ్మయమున 'గద్యబ్రహ్మ' యనిపించుకొన్న శ్రీ వీరేశలింగముగారి రూపకములలో నీ భాష పరిపక్వభావము పొందినది. సరళమైనది. వడ్డాది సుబ్బారాయుడు మొదలైనవారీ రచనామార్గ మునే అనుసరించిరి.

శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారు తమ నాటకములలో ఎక్కువభాగము తరువాతి కాల ములో రచించినను మూలవిధేయమైన రచనా మార్గము ననుసరించి ఈ కాలమున చేర్పవలసిన వారే. వారి నాగానందము, శాకుంతలము లీ కాల మున అనువదింపబడినవే. వీరు పాత్రోచిత భాషా వాదులు. వీరి అనువాదములలో సంస్కృతము లోని శబ్దము దగ్గరనుండి తెలుగుభాషలోనికి తీసు కొనివచ్చు ప్రయత్నము చేయబడినది. అనువాదము లన్నియు నిర్దుష్టముగ మూలార్థ భంగకారి కాకుండ నిర్వహింపబడినవి. వేదంవారి అనువా దము లన్నియు విద్వన్మనోహరములు కాని సారళ్య మును సంపాదించుకొనలేక పోయినవి. ప్రాకృత భాషా విషయమున శాస్త్రిగారు తమనాటకము లందు వ్యావహారిక భాషను ప్రయోగించిరి. ఈ భాషకు ప్రామాణికగ్రంథములలో స్థానము కల్పిం చిన మహాపండితులలో వీరుతొలివారు. గురజాడవా రీ కాలము చివరదశలో కన్యాశుల్కమును సంపూర్ణ వ్యావహారికభాషలో రచించిరి.

మొత్తముమీద ఈ కాలమునందలి రచనాపద్ధతి సంస్కృతభాషయొక్క పలుకుబడికి దగ్గరగా నున్నది. "పరిత్రాయేథా మనేన దుర్వినీతేన మధు కరే ణాభిభూయమానామ్ మాం" అన్నదానిని "నీతిమాలిన యీ తుమ్మెదచేత బాధింపఁబడుచున్న నన్ను రక్షింపుడు" (కం. వీ) అని అనువదించుట సంస్కృత వాక్యరచనా సంబంధి ప్రాబల్యము. "నన్ను ఈ నీతిమాలిన తుమ్మెద బాధించుచున్నది. రక్షింపుడు రక్షింపుడు" అనుట తెలుగుభాషా

సంబంధిరచనము. ఒక్కొక్క భాషలోని సౌంద ర్యము వేరొక భాషలో యథాతథములైన పద ములచేత వాక్యనిర్మాణముచేత సంపాదితముకాదు

ఈ దశ తరువాతిదశ రెండవది. దీనియందు ప్రముఖులైన రచయితలు శ్రీయుతులు శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు, తిరుపతి వేంకటకవులు, మంత్రిప్రెగడ భుజంగరావుగారు, దాసు శ్రీరా ములుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొదలైనవారు. ఈదశ కేవలము భావానువాద పద్ధతికి చెందినదశ. రచయితలు తగినంత స్వేచ్ఛ వహింపసాగిరి.

ఈ అనువాదకు లందరికిని స్వప్రతిష్ఠావాంఛ ఎక్కువ. ఈ అనువాదములు చాలవరకు రంగ స్థలముమీద అనువాదము పొందలేదు. క్రొత్తగా సాహిత్యములోనికివచ్చు యువకులకీ గ్రంథములు సాహిత్యపరిచయము కలిగించుచుండెను. సంస్కృత సాహిత్యసంబంధముకూడ వీనివలననే పెంపొందెను. శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారు ప్రవేశ పెట్టిన భాషలోని మార్పును ఎక్కువమంది అనుస రింపలేదు. తత్పూర్వ మున్నట్లు సర్వమును గ్రాంథిక భాషయందే అనువదించు పద్ధతినే ఎక్కువ మంది అనుసరించిరి. దాసు శ్రీరాములుగారు అచ్చ తెనుగులో శాకుంతలానువాదమును ప్రక టించిరి. ఇదియు నొక మార్గము.

ఈ రచయితలలో ఎక్కువమందికి మూలమునకు వ్యాఖ్యానము చేయుదృష్టి ఎక్కువ. కవి ఉద్దేశ్య ములను అనువాదకుడు విస్తరించి చెప్పును. కొన్ని కొన్నిచోట్ల వర్ణనాసందర్భములందు అనువాదకుడు తనకు తా నాపుకోలేక స్వయముగా వర్ణించును. పద్యపూరణమునకు మూలమున లేని విషయము లను చేర్చుట, కొన్నివిషయములను విడిచివేయుట చేయును. ఇది ఆనాటి అనువాద పద్ధతి. మొదటి దశలో కన్నను మూడవ దశలోకన్నను ఎక్కువ అనువాదములు ప్రకటింపబడిన దీకాలమునందే.

ఇక మూడవదశ. ఇది చాలమార్పుల కాలమైన కాలము. ఇది సాహితీసమితి కవులతో ఆరంభ మగుచున్నది. వ్యావహారిక భాషోద్యమము, నవ్య కవిత్వోద్యమము, జంటలు జంటలుగా సాగు చుండెను. ఈ కాలములో మొదటి దశాబ్దమున అనువాదములు తక్కువయే. సాహితీసమితి కవులు స్వతంత్ర గ్రంథరచనయందే దృష్టి కలిగియుండిరి. వారిలో నాటకములు రచించినవారే తక్కువ.

నాటక రంగములో ఈ కాలమున చాల మార్పులువచ్చెను. ఊరూర అనేక నాటకసమాజ ములు వెలసెను. వారనేక నాటకములు ప్రద ర్శించుచుండిరి. బళ్ళారిరాఘవ మొదలైన మహా నటులు నాటకరంగమును సముద్దీప్తము చేయు చుండిరి.

ఈ కాలమున పూర్వము బహుపర్యాయము లనువాదముపొందిన నాటకముల అనువదించు నాచారము తగ్గిపోయినది. ఇదివరకు అనువాదము పొందని రూపకముల చాలమంది అనువదించిరి. కొందరు పద్యములు మొదలైనవి ప్రదర్శనవేళ సహజభావమునకు భంగకారులని వచనములో అనువదింప దొడగిరి. రాపూరి వేంకట సుబ్బమ్మ గారు మృచ్ఛకటికమును గ్రాంథిక వచనములోనికి పరివర్తనముచేసిరి. ఈ గ్రాంథిక వచనమునకన్నను వ్యావహారిక వచనమే సమర్థమని కాటూరి వేంక టేశ్వరరావుగారు, భమిడిపాటి కామేశ్వరరావు గారు తలచిరి. కాటూరివారు వచనస్థానమున వ్యావహారికము ప్రవేశపెట్టిరి. భమిడిపాటివారు సర్వమును వ్యావహారికమందే నిర్వహించిరి. ఈ నడుమ మరల నీ యనువాదోద్యమము సాగించిన వారు శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు. వీరు భాసుని భారతరూపకముల నారింటిని అనువదించినారు. కొన్ని ప్రకటించినారు. ఈ కాలమునందు కొందరు కేవలమేపాఠ్యగ్రంథమున నుంపించుటకో యన్నట్లు అశ్రద్ధగా అనువాదమును సాగించియున్నారు.

స్థూలముగా ఇవి మనభాషలోని సంస్కృతాను వాద చరిత్రలో మూడుదశలు.

# పశువు | ఇబ్రాహీం జలీస్*

"నిన్న అర్ధరాత్రివేళ మౌల్వీఫతేఅలీ గోల్ బాగ్‌లో ఒక ఆడదానితో పట్టుబడ్డాడు"

ప్రతివాడూ ఈమాట సత్యమేనా అని అడుగుతున్నాడు. ఆసంగతి నాకేమీ తెలియదు. నేను సత్యానికీ అసత్యానికీ మధ్యనిలబడ్డాను. ఒకప్పుడనుకొనేవాడిని ; ఇంతమందీ అబద్ధంచెబుతారా అని. మరొకప్పుడనుకొనేవాణ్ణి ; మానవుడు బయటికొక విధంగా కనబడతాడు కాని లోపల ఇంకోవిధంగా ఉంటాడు అని. మనకళ్ళకు కనబడేవానికన్నా లోపలివాడు భిన్నంగా ఉంటాడేమో! ఈమౌల్వీనే చూడండి. నమాజుల్లో తలనేలకానించి ఆనించి నొసలు బొప్పెలుకట్టింది. చేతిపొడుగు గడ్డంపెంచుకున్నాడు. పాతఅనార్కలీవాడలోని వాళ్ళందరికీ ఆదరణీయుడు. సర్వప్రియుడు. ఆవాడలోని జనమంతా తమతమ కలహాలను పోలీస్‌స్టేషన్‌లో కాకుండా ఇక్కడే తీర్చుకొని పోతుంటారు. పెద్ద ఇమాం గారు లేనప్పుడు అందరూ ఈ మౌల్వీవెనక నిలబడి నమాజు చదువుతారు. మిగిలిన విషయాలన్నీ ఎట్లాఉన్నా ఇంట్లో సత్ప్రవర్తనగలిగిన భార్య ఉన్నది. ఇద్దరు ఎదిగిన కొడుకులున్నారు. పెళ్లీడువచ్చిన కుమార్తెలు ముగ్గురున్నారు. అయినా ఇంతటి అశ్లీలమైన పని చేశాడు మౌల్వీ! పోనీ తానేమైనా ఇల్లాంటి చెడ్డపనిచేసే వయస్సులో ఉన్నాడా అంటే అదీలేదు. దాదాపు ఏభై యేళ్ళు వస్తున్నాయి. చావు దగ్గరికి వచ్చింది. గోరీ అంచుమీద కూర్చున్నప్పుడుకూడా పక్కన ఆపేది ఉండాలా? రామరామ!

ఈవార్త వాడవాడంతా గుప్పుమన్నది. అనేక వార్తలుగా రూపొందింది. జనం నవ్వుతున్నారు. ఆశ్చర్యపడుతున్నారు. కాని నాకు నమ్మకం గలగలేదు. కాని ఇవ్వాళ మౌల్వీ ఆఫీసుకు రాకపోయేసరికి నేనూ నమ్మినంతపనీ చేశాను. ఆఫీసులో తోడి క్లర్కులంతా అంటున్నారు 'ఆమాట నిజం కాకపోతే ఇల్లా మొఖందాచుకునే అవసరం వాడికేమి వచ్చిందీ? ఏదో జరిగేఉంటుంది' అని. ఒకక్లర్కైతే ఆ మౌల్వీ స్థానానికి తనను ఎక్కించవలసిందిగా దరఖాస్తుకూడా పెట్టనేపెట్టాడు. ఇక మౌల్వీ ఆఫీసుకు రానేరాడని వాని ఊహ. ఇంతటి దుర్ఘటన జరిగినతరువాత ఏమొఖం పెట్టుకుని వాడు ఆఫీసుకు వస్తాడు?

మా కార్యాలయంలో అందరూ మౌల్వీఫతేఅలీని చాలా గౌరవించేవారు. ఆయన మా అందరికన్నా సీనియరు. పాపం చాలాపని చేసేవాడు. ప్రొద్దున ఏడుగంటలకు ఆఫీసుకువస్తే సాయంకాలం ఎనిమిది గంటలకుకాని ఇంటికి వెళ్ళేవాడు కాడు. ఆయన వ్రాసే ముసాయిదాలు ఎంత బాగా ఉండేవంటే ఇంగ్లీషు అధికారులుకూడా అందులో ఏమీ కొట్టివేయకుండా, దిద్దకుండా సంతకము పెట్టేవారు. ఆయన జీతం మధ్యరకంగా ఉండేది. కాని ప్రతివస్తువూ ప్రియమైపోయిన ఈ రోజుల్లో ప్రతి క్లర్కూ ధగధగలాడే లంచపుదూపాయల కుప్పలను గూర్చి కలలుగనేవాడు. మౌల్వీ ఫతే అలీ ఎన్నడూ ఒక దబ్బు కూడా లంచం పుచ్చుకోలేదు. ఎవరైనా ఆయనఅరచేయిని అల్లా

---

* జలీస్ ప్రఖ్యాత ఉర్దూకథకులలో నొకరు. జననం 1924. దాదాపు పదిహేను పుస్తకాలు రచించినారు. ప్రస్తుతం పాకిస్తాన్‌లో ఉంటున్నారు.

ధగధగ లాడించాలని ప్రయత్నం చేస్తే ఆయన ఆ చేయి ముందుకుచాపి చిరునవ్వు నవ్వుతూ తన హస్త రేఖలను చూపించేవాడు. "చేతిలో కత్తెర ఉంది. నా చేతిలో డబ్బుగీత ఎల్లాగూలేదు. భగవంతుడు మీ పని పూర్తి చేస్తాడు" అనేవాడు.

తరువాత మౌల్వీ తానే వాళ్ళపని చేసిపెట్టేవాడు.

ఈ విధంగా ఆయన ప్రసిద్ధి పాత అనార్కలీ వాడలోనే కాక డిప్టీ కమిషనరు కార్యాలయం చుట్టూరా ఉన్న లాహోరు నగరంలో కూడా వృద్ధిపొందింది.

కాని ఈ మౌల్వీయే నిన్న అర్ధరాత్రివేళ గోల్ బాగులో ఒక ఆడదాని వెంట...

ఆఫీసునుంచి ఇంటికి పోతున్నప్పుడు త్రోవలో 'పాకిస్తాన్' టీ స్టాలు దగ్గర నాకు గులాం మొహమ్మద్ కనబడ్డాడు. భయంకరంగా ఉన్న పెద్ద పెద్ద మీసాలను తిప్పుతూ వచ్చి గుండాలాగా కనుగీటి ఇలా అన్నాడు. 'చెప్పండి బాబూ! తమరి స్నేహితులు, మౌల్వీగారు ఎక్కడున్నారు?'

నేనేమీ చెప్పకముందే వాడు పెద్దగా అట్టహాసము చేశాడు, ఆ ప్రశ్నకు అట్టహాసమే ప్రత్యుత్తరమన్నట్లు!

నేను వాడిని ఆపి కొంత మాటాడుదామనుకొన్నాను. కాని వానివెంట ఎవరో ఆవారా ఆడమనిషి ఉన్నది. దాన్ని వాడు సైకిల్ మీద ముందర ఎక్కించుకొని వెళ్ళిపోయాడు.

గులాం మొహమ్మదు కనపడి నవ్విన తరువాత మౌల్వీఫతే అలీగారి ఈ కుకర్మకూ గులాం మొహమ్మదుకూ ఏదో గాఢమైన సంబంధం ఉన్నదని నాకనిపించింది. గులాం మొహమ్మదు మౌల్వీకి చాలాకాలంనుంచి పక్కింటివాడు. పాకిస్తాన్ ఏర్పడి మౌల్వీ లాహోరుకు రాకముందు ఢిల్లీలో ఉన్నప్పుడు కూడా గులాం మొహమ్మదు ఆయన ఇంటిపక్కనే ఉండేవాడు. మతకలహాల గడబిడలో ఢిల్లీలో ఇళ్ళను దోచి కాల్చి జనాన్ని చంపినప్పుడు సబ్జీమండీలో జరిగిన కల్లోలంలో గులాం మొహమ్మదు చచ్చిపోయినాడని వదంతిపుట్టింది. అప్పుడు మౌల్వీ ఫతేఅలీ వాని భార్యను పిల్లలను హుమాయూన్ గోరీదగ్గరి శరణార్థుల కాంపులోనికి చేర్చాడు. వారికి ధైర్యం చెప్పాడు. బ్రతికినంత కాలమూ వారిఖర్చులు తానే భరిస్తానని వాగ్దానం చేశాడు. కాని హుమాయూన్ గోరీదగ్గరికి చేరగానే మౌల్వీకి చాలా ఆశ్చర్యం కలిగింది. గులాం మొహమ్మదు చావలేదు, బ్రతికేఉన్నాడు. అక్కడ మెట్లమీదకూర్చొని తన పెళ్ళాంబిడ్డలు చచ్చిపోయినారనుకొని వాళ్ళను తలచుకొని బొబ్బలుపెట్టి ఏడుస్తున్నాడు. మౌల్వీఫతే అలీవెంట తనవాళ్ళను చూడగానే వాడు మౌల్వీకాళ్ళపైబడ్డాడు. గుండాగిరీకి తానున్న వాడలోనేకాక వేరేవాడల్లోకూడా పేరుమోసిన గులాంమొహమ్మద్, పోలీసులముందు కూడా ఎన్నడూ తలవంచనివాడు, మౌల్వీకి జీతం బత్తెంలేని సేవకుడైనాడు. తరువాత వాళ్ళిద్దరూ శరణార్థులుగా లాహోర్ చేరుకున్నారు. లాహోర్ వచ్చి గులాంమొహమ్మదు తాను ఢిల్లీలో వదలి వచ్చిన ఒక్కింటికి బదులు రెండిండ్లకూ అధికారి ఐనాడు. పెద్దఇల్లు తానుంచుకొని చిన్నది మౌల్వీకి ఇచ్చాడు.

లాహోర్ చేరుకొన్న తరువాత వారిసంబంధాలు మెల్లమెల్లగా చెడిపోతూ వచ్చినవి. దీనికి ఒక కారణమేమంటే వాళ్ళు పక్కింటివాళ్లు. పోట్లాడుకోక ఇంకేంచేస్తారు? ఇంకో కారణం ఏమంటే మౌల్వీ మసీదుకుపోతే గులాం మొహమ్మదు మధుశాలకు వెళ్ళేవాడు. గులాం మొహమ్మదు ఇక్కడికివచ్చికూడా గుండాగిరీ వదలిపెట్టలేదు. గుండాగిరీకారణంగా ఢిల్లీలో ఉన్నప్పుడు వాడికొక్కసారి జైలుకుకూడా వెళ్ళవలసివచ్చింది. మౌల్వీఫతే అలీ వానికెప్పుడూ నచ్చచెపుతుండేవాడు, వానిని బ్రతిమిలాడేవాడు, కోపపడేవాడు, లాలించేవాడు. గులాం మొహమ్మదు ఆయనను ఎంతో కొంత గౌరవించేవాడు కాని ఒకప్పుడు

మౌల్వీచేసిన అన్ని ఉపకారాలకీ బదులు మంచి శాస్తిచేశాడు.

ఒకప్పుడు ఒక రమ్జాన్ రాత్రి మౌల్వీఫతే అలీ అర్ధరాత్రివేళ నమాజుచదివి ఇంటికివస్తుంటే గోల్ బాగ్ దగ్గర ఆడదాని అరపులసవ్వడి వినిపించింది. మౌల్వీ పరుగెత్తుకొని అక్కడికిపోయేసరికి గులాం మొహమ్మదూ, ఇంకాముగ్గురు నలుగురూ, ఒకపద నాల్గు పదిహేనేండ్ల అమ్మాయిని చుట్టుముట్టి నిల బడ్డారు.ఆఅమ్మాయి మౌల్వీనిచూడగానేచటుక్కున ఆయనపైబడి అరవటం మొదలుపెట్టింది. 'నన్ను రక్షించండి, మీకు పుణ్యముంటుంది. నన్ను రక్షిం చండి' అని.

మౌల్వీ గౌరవాన్ని ఏమాత్రం లెక్కచేయ కుండా గులాం మొహమ్మదు గుఱ్ఱుమన్నాడు.

'మౌల్వీగారూ ! నమాజు చదువటానికి వచ్చారా! ఇది మస్జిద్ కాదు. గోల్ బాగ్. ఆ పిల్లను వదిలే యండి. అది మాది.'

మౌల్వీ ఫతే అలీ గులాం మొహమ్మదును గద్దిం చాడు. కాని వాడు కదలలేదు. పైగా వాడు జేబులోనుంచి చాకు తీశాడు. కాని ఇంతలోకే ఔజాహీలు వైపునుంచి వస్తున్న కారుదీపాల వెలుగు కనపడగానే ఆ గుండాలంతా పారి పోయారు. కారు దగ్గరకురాగానే మౌల్వీ గొంతెత్తి పిలిచి ఆ కారును ఆపాడు. కారులో ఎవరో ఇద్దరు యువతీయువకు లున్నారు. మౌల్వీ జరిగిన కథంతా వాళ్ళకుచెప్పి ఆ అమ్మాయిని ఆ కార్లో కూచోబెట్టి ఇంట్లో దిగబెట్టాడు.

ఆకారణంవల్లనే రెండోవాడు గులాం మొహ మ్మదు మౌల్వీ పులినోటికండను విడపరచాడు అని అతనితో పోట్లాడుకొన్నాడు. కాని మౌల్వీ ఏమన్నాడంటే తా నా అమ్మాయిని కాపాడలేదు. తాను కాపాడింది గులాంమొహమ్మదు భార్యనూ పిల్లలనూ.

దీనితరువాత వారిద్దరిమధ్య మరీవిషమించింది. మౌల్వీమీద కసితీర్చుకోటానికి గులాం తలా తోక లేని ఎన్నోదుర్భాషలు ప్రచారంచేయటం మొదలు పెట్టాడు. నిన్నరాత్రి ఒకఆడదానితో మౌల్వీ పట్టు బడ్డ విషయంకూడా గోల్ బాగ్ లో జరిగిందోలేదో కాని గులాంమొహమ్మదు పుఱ్ఱెలోమాత్రం తప్ప కుండా జరిగింది అని నేననుకున్నాను. మౌల్వీఫతే అలీని అవమానించటానికే గులాం మొహమ్మదు ఈపన్నాగం పన్నాడనికూడ నేననుకొన్నాను.

అప్పటికి నాకు కొంతమనస్సు కుదుటబడ్డది. నేను ఇంటికి పోవటానికి ముందు మౌల్వీ ఇంటికి పోవటం మంచిదనుకొన్నాను. ఎందుకంటే నా మనస్సులోనుంచి ఆ అనుమానం చాల వరకు దూరమైపోయింది. అందువల్ల నాకు మౌల్వీ దగ్గ రకు పోవటానికి జంకులేదు. మౌల్వీకూడా సిగ్గుపడే అవకాశం లేదు.

త్రోవలో ఔరంగజేబుహోటల్ దగ్గర అబ్దుల్ రషీద్ కలిశాడు. వాడు నాకూ మౌల్వీకి ఇద్దరికీ దగ్గరి స్నేహితుడు. మేము ముగ్గురమూ ప్రతిరోజు సాయంకాలం ఔరంగజేబ్ హోటల్లో కూచొని రేడియోలో రాత్రివచ్చేవార్తలు వినే వాళ్ళం, పత్రికలు చదివేవాళ్లం, టీతాగి గప్పాలు కొట్టుకూ కూర్చునేవాళ్ళం. కాని ఇవ్వాళ నియ మానికి విరుద్ధంగా ప్రొద్దుగూకకముందే అబ్దుల్ రషీద్ హోటల్ లో ప్రవేశిస్తున్నాడు. నన్నుచూచి రమ్మనిపిలిచాడు.

"ఓహో! రా! రా! నీకోవిచిత్రమైన వార్త చెప్తాను."

లోపలకి వెళ్ళగానే టీకోసంచెప్పి అటూ ఇటూ చూచి అబ్దుల్ రషీద్ ఇలా అన్నాడు.

'ఏం చెప్పమంటావోయి! రాత్రి మన మౌల్వీ గాడు కొంపముంచేశాడు. నువ్వింకా వినలేదా? రాత్రి మౌల్వీ'.

నేనన్నాను. "విన్నానులే. కాని అది నిజం కాదేమో అని నేననుకొంటువ్వాను. ఇందులో ఆ గులాం మొహమ్మదు ఎత్తుఏదో ఉంటుంది."

అబ్దుల్ రషీదు అన్నాడు. 'ఎస్ట్రాగిత్తూ ఏమీ లేదు. నా కిప్పుడే తానాలోని పోలీస్‌జవాన్ కన పడ్డాడు. వాడే చెప్పాడు నాకు, రాత్రి మౌల్వీని ఒక ఆడదానితో ఉండగా తానే పట్టుకొన్నానని, తెల్లవారేవరకూ ఆ ఆడదాన్నీ మౌల్వీనీ లాకప్‌లో కూడా ఉంచారట.!'

'ఆ ఆడదెవరో తెలుసా ?' నేనడిగాను.

రషీద్ అన్నాడు. 'ఎవతో ఏమో! ఎవరైనా పచ్చిబజారు ఆడది అయిఉండాలె. లేకపోతే నలభై ఐదు. యాభై ఏళ్ళముసలివాన్ని పట్టుకొంటుందా?'

నేను మళ్ళీఅడిగాను. 'ఇవ్వాళ నువ్వు మౌల్వీని కలిశావా?'

'ఇక వాణ్ణికలిసేదేముంది? వాడేంకనబడతాడు మనకు?'

నేనన్నాను, 'అల్లాకాదు. వాడిదగ్గరకు పోదాం పద. కనీసం మనమైనా వాడిక కలియకపోతే ఎట్లా ! నిజానికి, ఎందుకోగానినాకుమాత్రం నమ్మ కము కలగటంలేదు. నేను నమ్మితీరవలసిందే అని అందరూ అంటున్నారు. నువ్వూ అదేఅంటున్నావు కాబట్టి ఇక సందేహపడటానికి ఎక్కువవీల్లేదనుకో. కాని...కాని ఇప్పటికీ నా మనస్సులో కొంత సందేహంగానే ఉంది. సందేహానికీ నమ్మకానికీ గొప్ప సంఘర్షణ జరుగుతున్నది నా మనస్సులో.'

అబ్దుల్ రషీద్ అన్నాడు. "వాడితో కలియటం వట్టి వ్యర్థపుపని అని అనుకుంటున్నాను. వాడు కలువడు."

నేను ఒత్తిడిచేసి వాడిని మాట్లాడకుండాచేశాను. 'నువ్వైతే నడువు. ఆఖరిసారి కలుస్తున్నాం అని అనుకోని కలుస్తాం పద.'

మేమిద్దరమూ బయటికి వచ్చి కొంతదూరము నడువగానే మౌల్వీఫతేఅలీ పెద్దకొడుకు రఫీ కన బడ్డాడు. వాడు చేతిలో మందులపెట్టె పట్టుకొని ముందు నడుస్తున్నాడు. వాని వెనుక డాక్టర్ మన్సూర్ అలీ నడుస్తున్నాడు. నేను రఫీతో అడిగాను.

"ఏంసంగతి రఫీ? అంతా మంచిదేనా ?"

రఫీ చాలా వ్యాకులంగా భయకంపితుడులాగా కనబడ్డాడు. వాడు రెండేముక్కలు మాటాడాడు. 'అమ్మ...అమ్మ...'

వాడు మళ్ళీ మాటాడలేదు. తొందరతొంద రగా నడవటం మొదలుపెట్టాడు. అబ్దుల్ రషీదు ఆ మాటలు విని నాతో అన్నాడు. 'పాపం. ఆవిడ మంచిది. మౌల్వీ చేసిన సిగ్గులేని పనిని ఆమె ఓర్చుకోలేకపోయిఉంటుంది.'

రఫీ మాట్లాడకుండా వెళ్ళాడు. మేమిద్దరమూ మౌల్వీ ఇల్లు చేరుకొని తలుపు తట్టాము. లోపల డాక్టరున్నాడు. రఫీ బయటికి వచ్చి అన్నాడు. 'కొంచెం ఆగండి. ఇప్పుడే నాయనగారిని పిలుస్తాను.'

మాకిద్దరికీ బయట రోడ్‌పైననే నిలుచుండవలసి వచ్చింది. మౌల్వీ ఇంట్లో కూర్చునే గదిఅంటూ లేదు. ఆ యింట్లో రెండే గదులు. అందుకోసమే మౌల్వీ ఔరంగజేబు హోటల్‌నే తన డ్రాయింగు రూముగా చేసుకొన్నాడు.

చాలసేపటి వరకూ మౌల్వీ బయటికి రాలేదు. డాక్టరు బయటికి రాగానే మేము సంగతేమిటో కనుక్కున్నాము. మౌల్వీ భార్య ఆత్మహత్యా ప్రయత్నంలో తులంనర నల్లమందుతిన్నదట.

రఫీ మళ్ళీ డాక్టరు వెంట వెళ్లాడు. బహుశః మందుకోసం ఐఉంటుంది.

మాకనిపించింది ; మౌల్వీ నిజంగానే మౌల్వీల పురాతన ఆచారాన్ని పాలించినాడని. వాడిక మమ్ములను చూడదలచుకోలేదు. మేము తిరిగి పోదామని అనుకుంటుండగానే అకస్మాత్తుగా నా దృష్టి తలుపుపైపు పడ్డది. తలుపు కొంచెం తెరచు కున్నది. మౌల్వీ దానిచాటునుండి దొంగవలెనక్కి చూస్తున్నాడు. నేను మౌల్వీని గుర్తుపట్టాను. దగ్గ రకు పోయి అన్నాను.

"మౌల్వీ! తలుపుతీయి. దాగుండి లాభమేమిటి? మేము నీకుభాన్ని కోరేవాళ్ళం. మా సహాయం

నీకు కావలిస్తే ఇప్పటికీ మేంచేయటానికి సంసిద్ధులం. అందుకే మేము నీదగ్గరికి వచ్చాము."

మౌల్వీ తలుపు తెరచాడు. మేము లోపల ప్రవేశించాము. అది గది కాదు. కొంత వంటశాల. కొంత స్నానాలగది వగైరా వగైరా, ఒకవైపు పొయ్యి. ఇంకొకవైపు నీటిపైపు. ఒకవైపు ట్రంకులుపెట్టి ఉన్నవి. ఇంకోమూలకు కొన్ని పాత్రలు నీటిబకెట్ దగ్గర పడి ఉన్నవి. మౌల్వీ మమ్మల ట్రంకులపై కూర్చోబెట్టి తాను అక్కడ పడి ఉన్న మైలగుడ్డలమూటమీద కూర్చున్నాడు. మౌల్వీ ముఖం వాడిపోయింది. తలవంచుకొన్నాడు. కొంతసేపటివరకూ ముగ్గురమూ నిశ్శబ్దంగా కూర్చున్నాము. తరువాత నేనడిగాను 'వదినెగారికేం భయం లేదుకదా ?' అని.

ఖిన్నస్వరంతో మౌల్వీ అన్నాడు, 'ఆ! ఎట్లో చక్కింది.'

రషీద్ అడిగినాడు. 'ఏమోయి ! ఇదేమిటి ? ఏంజరిగింది ?'

నేను కోపంతో రషీద్‌వంక చూచాను. రాత్రి జరిగినదానితో సంబంధమున్న ఏవిషయంకూడా నేను మాటాడకూడదనుకొన్నాను.

మౌల్వీ రషీద్‌వంక చూచాడు. తరువాత నా వంక చూచాడు. వెంటనే కర్కశ స్వరంతో అన్నాడు, 'మీరు నా ఇల్లు చూస్తున్నారుకదా ! ఒకపెద్ద ఇంటికోసం పదిహేనిరవై దరఖాస్తులు పెట్టుకున్నాను. ఏమీకాలేదు. ఈ రెండుగదులు-రెండెక్కడివి ? ఒక్కటే- ఇదిగదా ? దీన్ని గది అంటారా ?"

వాడు మావైపు జవాబుకోసం అన్నట్లు తీక్షణంగా చూడసాగాడు. మా దగ్గర ఏమీ జవాబు లేదని తెలిసినవాడు చూచినట్టుగా చూడసాగాడు. మేము వాడికి రోజూ కలిసే మిత్రులం కానట్టుగా, పునరావాస శాఖకు చెందిన అధికారులను చూచినట్టుగా చూడసాగాడు.

మళ్ళీ అనటం మొదలుపెట్టాడు. నేను 'పాకిస్తాన్ వచ్చి రెండేళ్ళయింది. ఈ రెండేండ్లనుంచీ నేను నాభార్యతో, ఇద్దరు ఈడు వచ్చిన కొడుకులతో ముగ్గురు ఈడు వచ్చిన కూతుండ్రతో ఈ గదిలో కైదుచేయ బడ్డాను. ఈ జైలు నా కెన్నాళ్ళవరకో చెప్పండి. నేనూ మనిషినే. నేనూ పిచ్చివాణ్ణయితాను. పొండి. ఈ కైదులో నలిగి నన్ను చావనివ్వండి. ఇక్కడ నుంచి పొండి, వెళ్ళండి.'

అని తానే లేచి లోపలికి వెళ్ళాడు. లోపలినుంచి వానిభార్య మూలుగుతున్న చప్పుడు వినవస్తున్నది. మేము రెండు మూడు నిముషాలు అల్లాగే కూచుని బయటికి వచ్చాము.

త్రోవంతా రషీద్ మౌనంగానే ఉన్నాడు. ఏంచేయాలో నాకేమీ తోచలేదు. మేము మళ్ళీ ఔరంగజేబు హోటల్లో వచ్చి కూర్చున్నాము. అక్కడ ఆ వీధి పోలీస్‌స్టేషన్ అధికారి రియాజ్ మొహమ్మదు కూడా ఉన్నాడు. మమ్మల్ని చూచి ఆయన టీ త్రాగటానికి పిలిచాడు. మేము వెళ్ళి ఆయన టేబుల్ దగ్గర కూచున్నాము ఆయన కప్పులోనుంచి టీ సాసరులో దొర్లించుకొని రెండు గ్రుక్కలు త్రాగాడు. తరువాత జేబురుమాలుతో టీతో తడిసిన పెద్ద పెద్ద మీసాలు తుడుచుకుంటూ అన్నాడు.

'రషీద్! మీ మిత్రుడు మౌల్వీఫతేఅలీ కూడా చాలావిచిత్రమైన మనిషి. అర్ధరాత్రివేళ పెళ్ళాన్ని షికారుకు తీసుకొని గోల్ బాగుకు వెళ్ళాడు. అబ్బబ్బ! ఇల్లాంటి పనికి ఇంట్లో చోటు లేదా :'

రషీద్ నేనూ ఒక్కసారే ఉలికిపడి ఆశ్చర్యంగా అడిగాము.

''ఏమీ! అది వాని భార్యా?'

పోలీస్ అధికారి తన ధోరణిలో చెప్పుకపోతున్నాడు. 'అబ్బబ్బా! మనిషి పశువుకన్నా హీనమైపోతున్నాడు. ఇంతింత పెద్ద గడ్డాల వాళ్ళకు కూడా పాకిస్తాన్ గౌరవాన్ని గురించిన ధ్యాస లేదు. ఇక పాకిస్తాన్ గతి ఏమౌతుంది ? ఏమంటారు ?'

కాని మేము పునరావాసశాఖ అధికారుల్లాగా మాట్లాడకుండాకదలకుండా కూర్చున్నాము.

అనువాదం : జువ్వాడి గౌతమరావు

మోటూరి వేంకటరావు | కొండవాక

# కొండవాక

నా గుండియలో హరుసము
వాఁగై ఉరడించు లాగు పరువంపు నెఱిన్
దూఁగాడెడు తరగలతో
నూఁగారిన కొండవాఁక నుసులుచు మ్రోఁగెన్.

ఈ గిరికోన నెన్న డుదయించెనొ, సన్నని తేనె సోనగా
సాగుచునున్న దీసెల, పిసాళిహొయల్ వడఁబోయు లేయలల్
రాగము తీయ కర్కశపు ఱాయెదలన్ వలపూరి చెల్వపున్
వ్రేఁగున వీఁగియాడి ప్రసరిల్లెడు తీయని పాయయోయనన్.

మిలమిలల్ వెలరారు సలిలంపు జలతారు
జిలుఁగు పయ్యంట కుచ్చెలు చలింప,
ముత్తెంపు జిగిజగ్గు నొత్తరించెడు నిగ్గు
చిలికించు నురుఁగు నవ్వులు దొరంగ,
ఒయ్యారముల సొంపు నొలకఁబోసెడు వంపు
నడలలో మధుర విన్యాస మొదవ
నును వీణె రవళి కమ్మని గాన మివతలిం
చిన లీల అలల నిస్వనము గ్రాల
చలన చలనమ్ములో వయఃకళ వెలార్చి
బెళుకు బయకారముల జార్చు కులుకులాడి
వలె వరఁగలించి ఈ కొండసెల స్రవించు
వెలుఁగు తుటుములు నిలువెల్ల వెల్లిగొనఁగ.

తన చైతన్య హృదంతరాళము రసోత్సాహమ్ముతో చింది, న
ర్తనమున్ సల్పఁగ అంతులేని రుచిరక్రాంతిన్ దిగంతాలకున్
జని అంభోధి గభీర గర్భమున లీనం బొందునో; తన్మయం
బున మధ్యస్థలి ప్రీలి నిర్ఝరము వమ్మం జెందునో మృత్తికన్;

కదలి యొడినిగాని, పుడమి కౌఁగిట నేని
జీర్ణమైన నేమి ? శీతలామృ
తంపు శీకరములు తన పార్శ్వముల నింపు
మిసిమివెల్లి—పసిఁడి పసలవల్లి.

జలజలవాఱు ఈ సెల తుషారరుతుల్ వెలిచిమ్మ మన్మనః
ఫలకమునన్ బ్రతిధ్వనులు ప్రమ్మె కరంగుచు నేనుకూడ ని
ర్మల మధుధారనై సుధలు రాల్చి ద్రవింతునొ ! జాలిజాలిగా
కలఁగి లయింతునో కరడుగట్టిన ప్రన్నని కంటిజాలునై !

జలధి తోయమ్ముతో చెలియలికట్ట
చెలఁగి నిచ్చలు క్రీడ సలుపు కైవడిని
ఈ చిన్ని వాఁకతో నా చెల్మి రేక
ఏ చిరంతన దీప్తినో చేదికొనుచు
మహిత స్ఫురచ్ఛాయ మసలి ఇత్తఱిని
బహు జన్మపుణ్య సంబంధమ్ము నెఱపె-
యుగయుగమ్ముల నుండి ఉరియాడి యిల్లై
నెగడు జన్మాంతర ప్రగతి మా నడుమ-

* * *

వంక నేనై, నేను వంకగా మారి,
ఇంక ఎన్ని భవమ్ము లెత్తఁగా వలెనొ !

## కిషన్ పట్నాయక్ | * ఆనందీబాయి

బహుమాన ప్రదానముయొక్క ఔచిత్యానుచిత్యములు విచారించుటయే విమర్శయొక్క ఉద్దేశ్యమైనప్పుడు పుస్తకముయొక్క విమర్శ శోభించదు. అంతర్జాతీయ సాహిత్యరంగమునందిటువంటి దుర్వివాదమొకటి మొన్నమొన్నవే లేచినది. అందువలన ఆగామికొన్ని సంవత్సరముల వరకును ఒక రచయితయొక్క సరియైన స్థానము నిర్ణయించుట కష్టమైపోయినది.

ప్రపంచమందన్నిచోట్లలో రచయితలెంత రక్షణలేని స్థితిలో నున్నారో, ఈ జాతీయ, అంతర్జాతీయ, స్థానీయ బహుమానములు మాటిమాటికి జ్ఞప్తికి దెచ్చుచున్నవి. లౌకికమైన విజయసాధనకు నేటికిని కళాకారులు, వైజ్ఞానికులు, ఆర్థికముగా రాజకీయముగా శక్తిశాలురైన వారిపై అధారపడియున్నారు. ఈ విజయమునకు రెండు దశలున్నవి. ఒకటి గౌరవసంపాదన, రెండవది ధనసంపాదన. బహుమానమువలన రచయితలకీ రెండును సిద్ధించుచున్నవి. బహుమాన మిచ్చుచున్న సంస్థయొక్క ప్రతిష్ఠ, ప్రసిద్ధి ఎంత గొప్పవో ఆ బహుమానము వలన లభించు గౌరవమంత గొప్పది. కాని శోచనీయమైన విషయమేమనగా అధికముగా బహుమాన ప్రదానము చేయుచున్న సంస్థ కధికముగా ప్రసిద్ధి వచ్చుచున్నది. ఈ కారణము వలన ధనాధికారములయందు నియంత్రణము గలవారే రచయితకు గౌరవప్రదానము చేయగలుగుచున్నారు.

ఇట్లనుటవలన బహుమానము యొక్క ఇతర ఉత్తమలక్షణములను నిరాకరింపవలయునని తాత్పర్యము కాదు. రచయితయొక్క వృత్తిలోని లోపమేమనగా వాని ఉత్తమసృష్టి ఈ మానవ సమాజములో కొంతమంది చేతనే సమాదరింపబడుచున్నది. బహుమానము ద్వారా కొంతమంది మంచివారికి కొన్ని లౌకికములైన ఆనుకూల్యములు కలుగజాలినచో దానిని ప్రోత్సహించుట మంచిదే. కాని ప్రత్యక్షముగా ధనరూపమున బహుమానమొసగుటకంటె, శ్రేష్ఠమని నిర్ణయింపబడిన పుస్తకమునకు ప్రచారమార్గము లేర్పరచి గౌరవమును, పరోక్షరూపమున ధనసంపాదనకు అవకాశములు కల్పించుట మంచిపద్ధతి.

బహూకృతమైనరచన ఇతర రచనలతో తూచినప్పుడు శ్రేష్ఠమైనదా కాదాయన్న విచారణ అనవసరము. దీనివలన బహుమానములకు పుస్తకములను నిర్ణయించువారు సాహిత్యమును గురించిన విచారణ చేయగలుగు వారా కాదా యన్న అనావశ్యకమైన ప్రశ్న తలయెత్తును. అందువలన బహూకృతమైన పుస్తకము అసహజమైనదికాక, కనీసము సామాన్యముగానైన ఉచ్చకోటికి చెందినదైనచో బహుమానమును సార్థకముగా నెంచవలెను.

పరశురాముని కళాకృతులు నిస్సందేహముగా ఈ కోటికి చెందినవనవచ్చును. పరశురాంగారు చాలనాళ్ళనుండి హాస్యరచనలద్వారా వంగ సాహి

* 'అనందీబాయి ఇత్యాదిగల్ప్' రచయిత పరశురాం. 1958 లో సాహిత్యఅకాడమీ బహుమాన మందుకొన్న బెంగాలీ పుస్తకము.

త్యమును సమృద్ధ మొనర్చుచున్నారు. బెంగాలీ పత్రికలు చదువువారిలో పరశురాం పేరు వినని వారుండరు. వారి అసలుపేరు రాజశేఖర బసు అవి అనేకులకు తెలియకపోవచ్చును. తమరంగము నందు వంగదేశములో వీరద్వితీయులుగా నెన్న బడినారు. ఆధునిక భారత సాహిత్యమునం దంతటను హాస్యరససృష్టి మిక్కిలి స్వల్పము.

సరియైన హాస్యరసముయొక్క అభావము సర్వదా సాంఘిక అస్వస్థతను సూచించును. దీనిని కొంతవరకు జాతీయ సంస్కృతియొక్క గుణ ముగా చెప్పవలసివచ్చును. జర్మను ప్రజలయొక్క చారిత్రములో హాస్యరసముయొక్క అభావము అంగభూతముగా నున్నదని యందురు. భారతీయు లనుగురించి ఈమాట చెప్పుటకు వీలులేదు. భార తీయుల నవరసములలో హాస్యరసమునకు ముఖ్య స్థానమున్నది. భారతీయ సాహిత్యములో ప్రస్తుత మున్న హాస్యరసముయొక్క అభావము నేటి సాంఘిక అస్వస్థతకు చిహ్నము. ఈ స్థితిలో పరశు రామునివంటి హాస్యరసస్రష్టలు మరింత గౌరవము నకు పాత్రులగుచున్నారు.

స్థూలముగా హాస్యరసమును రెండుగా విభజింప వచ్చును. శుద్ధహాస్యము, వ్యంగ్య హాస్యము. వ్యంగ్యమెప్పుడును కటువుగానుండును. వినాశమే దాని ముఖ్యోద్దేశము. సాధారణ మానవుడు తన నిత్యజీవితములో పాపములతో దుర్గుణములతో పరివేష్టింపబడి యుండును. బాహ్యములైన కురీతు లను, దౌష్ట్యములనుగురించి యతడు జాగరూకుడై యుండడు. ఇది పాపమని, ఇది దుర్గుణమని చెప్పి వానికోపము నావైపు మరలించుట మిక్కిలి కష్టము. ఈ దౌష్ట్యమునే, ఈ కురీతినే వ్యంగ్య కళాకారుడు అవహాస్యముచేసి చూపించినప్పుడు నవ్వుచునవ్వుచునే దానికి వ్యతిరేకముగా వాతా వరణము కల్పింపబడును. అందువలననే సాంఘిక దుర్నీతులకు, అంధవిశ్వాసములకు వ్యతిరేకముగా వ్యంగ్యము శక్తిమంతమైన అస్త్రమైనది.

శుద్ధహాస్యము కటువుగానుండదు. పుట్టుకతో వచ్చిన దౌర్బల్యములుకొన్ని మనుష్యులలో సర్వ వ్యాపకముగా నుండును. ఆ దౌర్బల్యముల కారణ ముగా సమాజముతో కాలముతో ఆయా మనుష్యు లకు కలిగిన సంపర్కములో కొంత వైషమ్య మేర్పడును. వీనియొక్క వర్ణనవలన హాస్యోద్దీ పనము కలుగును. ఈ హాస్యము బహిర్ముఖమైనది కాదు. అంతర్ముఖమైనది. ఈ హాస్యము పాఠ కులను గాని శ్రోతలనుగాని కిలకిలార నవ్వించదు. కాని లోలోపల కొంత చక్కిలిగింత పెట్టిన ట్లుండును. రాజశేఖరబసు యొక్క హాస్యమీ ప్రధానలక్షణముచేత అనుప్రాణితమైనది. ఈయన యవలంబించిన సాహిత్యప్రక్రియ నవలకాని నాట కము గాని కాదు. కథానికలు రేఖాచిత్రములు మాత్రము. శుద్ధహాస్యరసమునకు సాఫల్యము కలి గించుటకు వాస్తవిక జీవనముపై సానుభూతి మరియు మానవుని మనస్సుయొక్క సూక్ష్మ ప్రవృత్తుల జ్ఞానముండుట యవసరము. లేకున్నచో హాస్యము మొద్దుబారిపోవు అవకాశమున్నది. పరశు రాంగారి పుస్తకములో ఈ గుణములు సంపూర్ణ ముగా కనబడును.

'ఆనందీబాయి మొదలైన గల్పికల' కన్న ముందు ఈ రచయితయొక్క ఏడు రచనా సంగ్ర హములు ప్రకటింపబడినవి. ఈ సంగ్రహములో పదిహేను కథానికలున్నవి. ఇవి మూడు విధములు 'ఆనందీబాయి' మరియు 'కాశీనాథేన్ జన్మాంతరే' మొదలైన కథలకు ఆధారము వ్యక్తులు పరిస్థితు లతో సరిపెట్టుకొనజాలక పోవుట. మొదటికథలో ఏబది సంవత్సరముల వయస్సుగల సేఠ్ విక్రమ్ దాస్ మొదటిభార్య ఆనందీబాయి జీవించియుండ గానే విలాస పరాయణుడై కలకత్తాలో ఒక బెంగాలీ యువతితో బొంబాయిలో ఒక సింధీయు వతితో ప్రచ్ఛన్నముగా వివాహము చేసికొనును. క్రొత్త శాసనములో బహుభార్యాత్వమునిషిద్ధమని తెలిసినపుడు ఆయనమనస్సులో ఎవరినివదలవలయు

నన్ను సంకటము పుట్టును. ఈ ద్వంద్వభావము, దాని పరిణతి - ఇవే కథగా రూపొందినవి. 'కాశీనాథేర్ జన్మాంతరే'లో నూరేండ్ల ముసలివాడొకడు చనిపోయిన తరువాత తన గతజన్మములో సఫలముకాని వాంఛలను ఫలవంతము చేసికొనుటకు వందయేండ్ల తరువాత యమధర్మరాజు ప్రత్యేకానుమతిచేత తన ప్రపౌత్రుని ఇంటిలో జీవనము గడపుటకు యువకుడుగా పూర్వజన్మ స్మృతితో వచ్చును. మారిన కాలము, పాతకాలపు సంస్కారము, వాని స్మృతులు- వీనికి పరస్పరము సరిపడదు.

'చితీబాజీ' (ఉత్తర ప్రత్యుత్తరములు) మరియు 'సత్యసంధ వినాయక్' రెండవ విధములైన కథల కుదాహరణములు. వ్యక్తులయొక్క మానసికములైన ఎగుడు దిగుడుల కారణముగా ఆ యా వ్యక్తుల జీవితములోని దైనిక సంఘటనలు హాస్యాస్పదము లగును. పై రెండు కథలు ఈ శ్రేణికి చెందినవే. జగత్తునందలి వస్తుస్థితిని ఏమాత్రము విచారించక రాజకీయములలో సంపూర్ణ సత్యమన్న నియమము పెట్టుకొనుటచేత వినాయకుడు గారికి కలిగిన దుర్దశ హాస్యాస్పదమే కాక దుఃఖదము కూడ. కథాంతము వినాయకుని మృత్యువుతో కాక ఆయన వస్తుస్థితిని గుర్తించినట్టుగా మలచబడినచో హాస్యరసము పోషింపబడి యుండెడిది. నిష్కపటుడైనవాడు తన మానసికములైన ఎగుడు దిగుడులవలన లోకములో ఎంత హాస్యాస్పదు డైనప్పటికిని వాడు తన సారళ్యము, తెలియనితనము కారణముగా మరణించినప్పుడు పాఠకు డానందించలేడు. ఈ విషయము పరశురామునివంటి సిద్ధహస్తుడైన హాస్యరసశిల్పికి తెలిసియే యుండును. 'చితిబాజీ'లో మిక్కిలి నిష్కపటుడైన ఒక యువకునికి, అపరిచిత, ప్రగల్భ, మిష్టస్వభావ, చతురయైన ఒక యువతికి మధ్యజరిగిన ఉత్తర ప్రత్యుత్తరములు, తుదకు వివాహము,మిక్కిలి మనోహరముగా, తరళముగా నున్నవి. ఇది చదువుచున్నంతసేపు మనస్సునకు చక్కిలిగింత కలుగుచునే యుండును.

'నిర్మోకనృత్యము' 'గగనచటి' మూడవ విధమునకు చెందినకథలు. ఈ కథలు తేలికగా చెప్పబడినవి. కాని వీనిలో గాంభీర్యమున్నది. కొంత తాత్త్వికతకూడ యున్నది. 'గగనచటి' లోని ప్రధానవిషయము మానవుల మిథ్యాభిమానాదులు. నభోమండలములో జరిగిన ఒక దుస్సంఘటన కారణముగా పృథివి అంతయు ధ్వంసమై పోవునన్న భయమేర్పడును. ఆ భయముయొక్క ప్రభావము ప్రపంచమునందంతయు మిక్కిలిగా పడును. లోకులు తమ తమ పాపకర్మములను స్మరించి బహిరంగముగా వాని నొప్పుకొందురు. పెద్దపెద్ద దేశములు తమతమ వైదేశికనీతిని మార్చుకొని శాంతినిగురించి ప్రకటనలు చేయుదురు. కాని 'గగనచటి' (చటి అనగా చెప్పు) అన్న దుష్టగ్రహము నభోమండలమునుండి అదృశ్యమగుటతోడనే వినాశముయొక్క భయము అంతరించి అందరును తమ మాట త్రిప్పుకొందురు. 'పోలీసుభయము చేత ఒప్పుకొనబడిన అపరాధమునకు న్యాయస్థానములో ఏవిధమైన మహత్త్వము లేనట్లు గగనచటి భయమువల్ల ఒప్పుకోబడిన అపరాధములు కూడ లెక్కచేయబడవు' అని ప్రభుత్వము వారు ప్రపంచమందంతట ప్రకటనలు చేయుదురు. నాలుగు పెద్దదేశములతోపాటు మిగిలిన చిన్న పెద్ద దేశములన్నియు కలిసి తమ శాంతినీతిని ప్రత్యాఖ్యానము చేసికొని ఒక సంయుక్త ప్రకటన చేయుదురు. 'గగనచటియొక్క అవిర్భావమువలన వికృత మేధస్కులమై మేము చేసిన ప్రలాపములను ఇక ముందు లెక్కచేయకూడదు' అని.

'నిర్మోకనృత్యము' అప్సరసయైన ఊర్వశిని గురించిన క్రొత్త కల్పన. ఊర్వశి క్రొత్తవారిని వశీభూతులను చేసికొనుటకు మర్త్య లోకమునకు పోవాంఛించును. తన సభలోనికే కొందరు మహాపురుషులను పిలిపించెద ననియు వారిని వశము

చేసికొని ఊర్వశి తన పిపాస తీర్చుకొనవచ్చుననియు ఆశపెట్టి ఇంద్రుడామె నాపును.

"నీవువారిని వశము చేసికొందువా ?"

"వారు పురుషులైనచో, ఎందుకు చేసికొనను?"

"వారు గొప్ప పురుషులు."

"అయినచో గొప్పగా వశము చేసికొందును."

ఆ ముగ్గురు మహాపురుషులు పర్వత, కర్దమ, కుతుక ఋషులు, నారదుని మిత్రులు. వీరిలో ఒకరికి కంఠమువరకు, ఇంకొకరికి రొమ్మువరకు, మూడవవారికి మోకాళ్ళ వరకును గడ్డములు కలవు. ఊర్వశి 'నిర్మోకనృత్యము' చేయుటకు— నిర్మోకనృత్య మనగా కట్టుకొన్న బట్టలు ఒకటి తరువాత ఒకటిగా ఒలిచివేయుచు నృత్యము చేయుట — ఆపాదమస్తకము అవృతయై వారి ముందుకు వచ్చును. నృత్యము చేయుచు ఊర్వశి వస్త్రముల నొక్కొక్కటిగా విసర్జించుట మొదలు పెట్టును. పర్వత కర్దములు ముఖము, శరీరోర్ధ్వ భాగము, అనావృత మైనంతనే సీత్కరించుకొని నృత్యమాపుమని కోరుదురు. వీ రిద్దరు తనకు వశులైనారని ఊర్వశి ఇంద్రునికి సైగచేయును. కాని కుతుకఋషి చివరవరకల్లే కూర్చుండి యుండును. యథాక్రమముగా తన సమస్తావరణములను పరిత్యజించి భూమిపై పారవేసిన ఊర్వశి తన నగ్నశరీర శుభ్రకాంతిచ్ఛటలను నలుదిక్కుల ప్రసరింపజేయుచు శిలవలె నిశ్చలముగా నిలబడును. సభలోని దేవర్షులు దేవతలు అందరును ఉచ్చైర్నాదముతో సాధు సాధు ప్రశంసా రావములు చేయుదురు.

కాని కుతుకఋషి ఇట్లు సెలవిచ్చును. "ఊర్వశీ! నిలబడితి వేల ? నిర్మోకమును పరిత్యజింపుము."

నారదుడనును: "నీ వనుచున్న దేమిటి ? నిర్మోక మెక్కడ నున్నది? ఉన్నవన్నియు ఊర్వశి ఇదివరకే విడచినది."

కుతుక ఋషి వాదించుట మొదలుపెట్టును. "దీని శరీరముపై పద్మపలాశము వలె రక్తమసృణమైన ఆవరణము నాకు కనిపించుచున్నది."

"అది చర్మము"

"దానినికూడ విడువుము."

"నీకు పిచ్చెక్కినదా? చర్మము శరీరముయొక్క భాగము."

"కావచ్చును. కాని అదియు నిర్మోకమే కదా ? ఆవరణమే కదా? దానిక్రింద చూడదలచు కొన్నాను."

"అయినచో వినుము. దానిక్రింద నున్నది మేద. మేదక్రింద మాంసము. దానిక్రింద కంకాళము."

"దానిక్రింద ?"

"ఏమియు లేదు."

"దేనివలన పురుషుని హృదయము తన్నుతాను మరచిపోవునో, రక్తధార వేగముగా ప్రవహించునో, ఊర్వశియొక్క ఆస్త్రీత్వ మెచ్చట నున్నది?"

"ఆ స్త్రీత్వము దాని వసనములో, ఆవరణములో అంగ ప్రత్యంగములలో, భావభంగిమలలో మరియు రాగియైన పురుషుని మనస్సులో నున్నది. నీవు వీతరాగుడవు కదా నీలో మనస్సు నశించినది. అది నీ కెట్లు కనబడును ?

కుతుక మహర్షి అప్రసన్నుడై వారందరు తన్ను ప్రతారించుచున్నారనుకొన్నాడు. లజ్జితయైన ఊర్వశిని చూచి మేనకాద్యప్సరసలు సంతోషముతో చప్పట్లు కొట్టుదురు.

పై యుదాహరణములవలన పరశురాముని హాస్యకళలో వస్తువునందు లఘుత్వము లేదన్నది స్పష్టపడుచున్నది. అశ్లీలత్వము తక్కువరకమునకు చెందిన హాస్యరసమున కాలంబము. దానిని రచయిత ఆశ్రయించలేదు. హాస్యము మొరటువారుట మిక్కిలి తేలిక. అట్లుండకపోవుట రచయితయొక్క సంయమనమును, సుసంస్కృతమైన రుచిని సూచించుచున్నది.

పరశురాముని కళయొక్క ఉద్దేశ్యము ఆయన పాత్ర ముఖముననే ఇట్లు చెప్పబడినది. "మనుష్యుని దుఃఖమునకు కొదువలేదు. వానిపై మరికొంత కల్పితమైన దుఃఖపు బరువు నెత్తుట రచయితయొక్క నిష్ఠురత్వమునకు నిదర్శనము. హాస్య కథలు వ్రాసి వానిని నవ్వించుడు; ఏడ్పించకుడు."

# చక్రవర్తి రంగస్వామి | బ్రతుకునీడ

## 1

గుట్టలకు మధ్యగావున్న గరువులోంచి, చిట్టడవిలోంచి నడవగా నడవగా వచ్చిన వూరిమధ్యనున్న దేవాలయ ప్రహరీగోడ ప్రక్కగా వెళ్ళి, ఎండిపోయిన చెరువుగర్భంలోవున్న కాలిబాటనే పోయి పోయి చివరకు ఆవూరు చేరుకున్నాడు విశ్వనాథం. పొలిమేరలో అడుగు పెట్టగానే స్వామివారి ఇప్పవనం, దానివెంట చింతలతోపూ దాటగానే కనపడ్డది ఒక చిన్నకొండ, కొండమీది దేవాలయం మండపం, కుడిప్రక్కగా నాలుగయిదు వందల పూరిండ్లూ, వాటిమధ్య రాజూ మంత్రిలాగు రెండు పూరిండ్లూ. దేవాలయానికి ఎదురుగా రెండుఫర్లాంగుల దూరంలో చెరువూ, చెరువుకు వెళ్ళే దారిలో తీరనిల్చిన అత్తిచెట్లూ కనిపించాయి. ఎటుచూసినా ప్రశాంతత, నిశ్శబ్ద గాంభీర్యతా, సుందర ప్రకృతీ !

ఆ పూరిండ్లముందు ఆడుకొంటున్న పిల్లలు 'కొత్తమనిషి ఎవరా?'అని చూశారు విశ్వనాథాన్ని. అతను అడగకపోయినా "గోపాలకిష్టయ్యగారి యిల్లా !" అని అడిగి "అదండీ ! అదేనండీ !" అని చిన్నివేళ్ళుపెట్టి చూపుతూనే వెంటపెట్టుకవెళ్ళి ఆయింటిముందు వదిలిపెట్టారు. తాళంతీసి తలుపు తెరచి లోపలికి అడుగుపెట్టాడు. బూజు అతనిని చుట్టుకొంది. ఆత్మబంధువులా దుమ్ముగిండివున్న ఆయింట్లో వెదకటం మొదలుపెట్టాడు. వెదికివెదికి చినిగిపోయిన తోలుపెట్టెనూ, తుప్పుపట్టిన రేకు పెట్టెనూ ముందువేసుకొని చూడటం మొదలు పెట్టాడు.

ఆ పెట్టెల్లో చిందరవందరగావున్న కాగితాలూ, వ్రాసినపుస్తకాలూ ఉన్నాయి. జిలుగూ గుండ్రనాలేని మాస్టరుగారి ఆ దస్తూరి ! అతనికి కన్నీళ్ళు నిండాయి. శ్రద్ధగా పరిశీలించి చూశాడు. కొన్నికథలు, కొన్నిగేయాలు, ఒక పెద్దనవల - మాష్టరుగారు వ్రాసినవి కాబోలు! ఆశ్చర్య సంతోషాలు కలిగాయి. మిగిలినవన్నీ ఎవరెవరో మాష్టరుగారికి వ్రాసిన జాబులు. ఒకటి తీసి చూశాడు..."ఆనాడు ఆత్మహత్య చేసుకోకుండా అడ్డుపడ్డారు. ఈనాడు యీ మాత్రం గౌరవంతో స్వతంత్రంగా బ్రతుకగలిగేలాగు చేశారు. ప్రపంచంలో నా అన్నవారు ఎవరూలేని నాకు, పుత్రిక విషయంలో తండ్రివలె, ఎంతశ్రమ తీసుకున్నారో తలచుకున్నప్పుడల్లా నా హృదయం కృతజ్ఞతతో నిండిపోతోంది. మేలుచేసిన మీరు అప్పుడే మరచిపోయి వుంటారు..." అది ఒక స్త్రీ ఉపాధ్యాయిని వ్రాసిన జాబు.

మరో జాబు-ఒక హరిజన యువకుడు వ్రాసింది. "...పితృ సమానులైన..." అని సంబోధించి వుంది.

'జహంగీర్' మాష్టరుగారి యోగక్షేమాలను అతి శ్రద్ధతో విచారిస్తూ భక్తినీ గౌరవాన్నీ ప్రకటించిన జాబు.

మాష్టరుగారి కుమారుడు తండ్రికి వ్రాసిన జాబు..."ఇంత పెద్దతనంలో మీరు ఒక్కరే ఎక్కడో కష్టపడుతూ వుండటం ఎందుకూ, ఎవరూ లేనివాళ్ల లాగా? నా దగ్గరకు వచ్చి వుండకూడదూ ?" అని బ్రతిమలాడుకొంటూ వ్రాసివుంది.

మాష్టరుగారి ప్రకృతి అతని కాశ్చర్యాన్ని కలిగించింది. "ఆయన చివరిదశలో యీ వూరికి వచ్చారు. బంధువులూ, అప్తులూ లేని ఆ వూళ్ళో ఆయన వున్నది ఎందుకో, ఎవరికీ తెలియదు. ఆ దేవాలయం, యీ పూరిల్లూ, ఆ చెరువుగట్టూ, ఇప్పవనం, చింతలతోపూ, చిట్టడవీ, కొండా - వీటి కోసమే కావచ్చు ఆయన యిక్కడ ఉన్నది. పైగా యీ రచనా వ్యాసంగంకొరకు గూడా అయ్యిండవచ్చు. ఆయన పండితుడు కాదు. ఆంగ్లభాషా పరిచయంకూడా లేదు. ఎందుకో ఆ వృద్ధాప్యంలో ఆయనకీ శ్రమ" అనుకుంటూ పాత దినచర్య పుస్తకం కనపడగా తెరిచాడు... "పూరిమీదుగా నడిచి మా వూరికి వెళ్తున్నాను. ఒక యింట్లోంచి ఏడుపు వినిపించింది. ఆ యింటి యజమానితో నాకు పరిచయం ఉంది. లోపలికి వెళ్ళాను. అతను ఆరాత్రే చనిపోయాడు. అంత్యక్రియలు జరిగే ఏర్పాట్లేమీ కనిపించలేదు. అతని భార్య ఏడుస్తో క్రమంగా తెలివి తప్పిపోతోంది. బిడ్డ దోగాడుతూ తండ్రిశవం దగ్గరకువెళ్ళి 'నాన్నా' అని పిలిచి శవం ముఖంమీద వున్న బట్టను తొలగించి 'దోబూచీ' అని ఒకసారి కిలకిలా నవ్వి, అమ్మదగ్గరకు వెళ్ళి 'దోబూచి! నాన్న! అమ్మా! అమ్మా!!' అని తండ్రి వేపు చూపేవాడు. ఇలా తల్లిదండ్రుల మధ్య, దుఃఖాన్నీ, మరణాన్నీ చూపే రెండు చుక్కలను కలిపే మెరుపు తీగెలాగా దోగాడుతూ ఆడుకుంటున్నాడు. ఆకలివేసినప్పుడు ఆట మరచిపోయి తల్లిని స్తన్యంకోసం పీడించేవాడు. ఆటా నిద్రా, నవ్వూ ఏడ్పూ తప్ప ఏమీ తెలీని ఆ పసికూన నా హృదయాన్ని ద్రవింపజేసింది. బిడ్డను ఒళ్ళోకి తీసికొన్నాను. ఆ నిమిషాన చేతి గడియారాన్ని అమ్మి అంత్యక్రియలు జరిపించివేశాను. "నా బిడ్డను కాపాడేవా రెవరు?" అన్న ఆమె దుఃఖాన్ని ఎలా తప్పించడం అనే ఆలోచనలతో నా బుఱ్ఱ తిరిగిపోయింది...ఆ బిడ్డను పోషించే భారాన్ని నేనే తీసుకున్నాను...ఆ బిడ్డే రామదాసు."

ఇలాంటివాటితో నిండివున్నాయి. ఆ పాత దినచర్య పుస్తకాలు. విశ్వనాథం శరీరం పులకరించింది. అన్ని కాగితాలను జాగ్రత్తగా భద్రపరచుకొని కొత్త ఉత్సాహంతో బయలుదేరాడు.

దారివెంట అతనికి మాస్టరుగారిని గురించిన జ్ఞాపకాలే తోడుగా నడిచాయి.

## 2

రోహిణీకార్తె. వడగాడ్పులు వీస్తున్నాయి. రైలుపట్టాల అవతల మాలపల్లిలో మంటలు లేచాయి. జనం పరుగెత్తుతున్నారు. విశ్వనాథం, ప్రకాశం బయలుదేరి మాలపల్లి చేరుకున్నారు. నీళ్లు తోడేవాళ్ళు, అంచలమీద నీళ్ళ కడవలను చేరవేసేవాళ్లు, మంటలమీద నీళ్ళు చల్లేవాళ్లు. నీళ్లు చల్లుతున్నవాళ్ళల్లో గోపాల కృష్ణయ్య కనపడ్డాడు. విశ్వనాథం ఆయనను మొదటిసారిగా చూడటం అదే. ముఖమంతా చెమట కారుతోంది. షర్టు తడిసిపోయింది. ఆ సెగకు దాహమయ్యింది కాబోలు, వీరడు తెచ్చిచ్చిన మంచినీళ్ళు తాగుతున్నాడు. వీరడు విశ్వనాథానికి తెలుసు. విశ్వనాథం తండ్రికి వీరడి తండ్రి ప్రతి ఏటా ఒక కిర్రు చెప్పులజత యిచ్చి పంటకళ్ళాలప్పుడు ధాన్యం పట్టుకెళ్లుతూ వుంటాడు. గోపాలకృష్ణయ్య కొత్తవాళ్ళనే సంకోచంలేకుండా "ఊఁ అందుకోండి" అంటూ వాళ్ళకు కడవలను అందించాడు.

ఎండాకాలపు సెలవుల్లో ఊరికే వుండటం యెందుకని హిందీ నేర్చుకోవాలనుకున్నారు విశ్వనాథం, ప్రకాశమున్నూ. హిందీ టీచరుకోసం వెదుకుతుండగా గోపాలకృష్ణయ్య హిందీ ట్యూషన్లు చెబుతాడని తెలిసింది. ఆయన దగ్గరే మొదలుపెట్టారు.

విశ్వనాథం చాలా తెలివైనవాడు. తాత తండ్రులు సంస్కృతాంధ్రాలలో పండితులైనందువల్ల అతనికి చిన్నతనంలోనే తెలుగులోనూ సంస్కృతంలోనూ మంచి ప్రవేశం ఏర్పడింది.

మాష్టరుగారి లోటుపాటులు కనిపెట్టాడు. ఆయన చదువు హైస్కూలు విద్యాపరిధిలో ఏ సగంలోనో ఆగిపోయి వుంటుందని అంచనా వేశాడు. హిందీ అయినా మొదటి రెండు పరీక్షలకంటే ఎక్కువ చెప్పలేడని గ్రహించాడు. మాష్టరుగారు పగలు చిన్నపిల్లలకు యిండ్లకువెళ్ళి ట్యూషన్లు చెబుతూవుంటారు. రాత్రిళ్ళు కొందరికి హిందీ చెబుతుంటారు. ఎందరికి యిలాంటిట్యూషన్లు చేపితే అరవై రూపాయలొస్తాయ్ గనుక? అనుకున్నప్పుడు అతనికి మాష్టరుగారియందు విపరీతమైన సానుభూతి కలిగేది. అందువల్లే మాష్టరుగారి వద్దకు అందరికంటే ముందుగావెళ్ళి కూర్చునేవాడు వేరే ఏమీ పనిలేనివాడిలాగా; ఆలస్యంగా బయలుదేరేవాడు యింటికి.

మహాదేవ్, శివశర్మ అనే యిద్దరు స్నేహితులు మాష్టరుగారి దగ్గరకురావటం విశ్వనాథం ఎరుగును. వాళ్ళు ప్రతిరోజూ సాయంత్రం శివాలయానికి వెళ్ళేవాళ్లు. మాష్టరుగారు వైష్ణవుడని తెలిసి వేళాకోళానికి ఆయన్నుకూడా రమ్మనేవాళ్ళు ఆలయానికి, చిరునవ్వుతో వాళ్ళవెంటవెళ్ళి విభూతి ధారణా, స్వామిదర్శనం, ప్రదక్షిణలూ వాళ్ళతోపాటు భక్తితో ఆచరించేవాడు. ఒకరోజు యిది అతని బంధువులుచూచి మండిపడ్డారు. అయినా అదేపద్ధతి వాళ్ళువచ్చి పిలిచినప్పుడల్లా.

ఎండాకాలపు సెలవులు గడిచాయి. స్కూళ్ళు తెరవడంతో పిల్లలు స్కూళ్ళల్లోచేరారు. మెట్టనపడ్డ చేపపరిస్థితి అయింది గోపాలకృష్ణయ్యది.

స్కూలుఫైనల్ మొదటిశ్రేణిలో ఉత్తీర్ణుడైన విశ్వనాథం కాలేజీలో చేరడంతో మాష్టరుగారికి దూరమైపోయాడు. అయినా ఆయననుగురించి తెలుసుకోవాలనే కుతూహలంమాత్రం తగ్గలేదు. ఒకరోజు బీడీకంపెనీ ఏజెంటువెంట బీడీకట్టలు మోస్తూ మాష్టరుగారు దూరంనుంచి కనపడ్డారు పెద్దబజారులో. తరువాత ఆయన యిక ఎప్పుడూ ఆవూళ్లో కనిపించలేదు విశ్వనాథానికి.

అతను బి. ఏ. ఆనర్సు పూర్తిచేశాడు. ఎండాకాలపు సెలవుల్లో రమ్మని వచ్చిన జాబుప్రకారం అక్కగారివూరికి వెళ్ళాడు. ఆచిన్నవూళ్ళో ఆవూరికి తగ్గ గ్రంథాలయంవుంది. ఏమీతోచక అతను ఆ గ్రంథాలయానికి వెళ్ళాడు. అక్కడ 'గోడ వార్తాపత్రిక' వ్రాసిఉంది. ఆ అక్షరాలు ఎక్కడో చూసినవి. గుండ్రగాలేవు, జిలుగూలేదు. విడి విడిగా స్పష్టంగా ఉన్నాయి ... కొంత సేపటికి జ్ఞాపకం వచ్చింది .... మాష్టరుగారివి ! మాష్టరుగారి మాటలుకూడా జ్ఞాపకం వచ్చాయి ... "నేను ఒక స్నేహితుడికి జాబు వ్రాశాను. అది చేరేటప్పటికి ఆ స్నేహితుడు సెలవుతీసుకొని ఊరికి వెళ్లాడు. అతను తిరిగిరాగానే స్నేహితులు అతనికి ఆ జాబు నిస్తూ 'నీకు ఎవరోయ్ ఆడవాళ్లు రాశారు జాబూ ?' అన్నారుట."

కొంతసేపటికి విశ్వనాథానికి గోపాలకృష్ణయ్య దొరికాడు. గ్రంథాలయం మూసాక గోపాలకృష్ణయ్య విశ్వనాథాన్ని తనయింటికి తీసుకెళ్లాడు. వంగే అలవాటులేని విశ్వనాథం తలకు ఎత్తులేని మాష్టరుగారి యింటి చూరు తగిలింది. మాష్టరుగారి పిల్లలు చుట్టూ మూగారు. "ఫస్ట్ ఎయిడ్ బాక్స్ తేనా" అని గోపాలక్రిష్ణయ్య అడిగాడు. "అంత అవసరం లేదులెండి" అని నవ్వుతో విశ్వనాథం తలను అరిచేతితో అదుముకున్నాడు.

మాష్టరుగారి రాబడిని గూర్చి అడిగాడు. ఉదయమే వార్తలు వ్రాయటం, ఎనిమిది నుండి ఐదుగంటల వరకు గ్రంథాలయంలో పని, తరువాత ట్యూషను, రాత్రిపూట పెద్దలబడి. అన్నిటికీ కలిపి యాభై రూపాయలు. లోపలినుంచి చక్కెరచల్లిన బొప్పాయిముక్కలు వచ్చాయి. ఇంతలో గోపాలకృష్ణయ్య కోసం ఎవరో వచ్చారు. తాగివచ్చి తండ్రీ కొడుకూ కొట్టుకుంటున్నారుట. తల్లి వచ్చి బ్రతిమలాడుతోంది- "అయ్యా, అయ్యా, నువ్వొచ్చి వాడికి బుద్ధి చెప్పయ్యా, లేకపోతే ముసలాణ్ణి చంపేస్తాడు. తండ్రీ, లేలే" అని.

గోపాలకృష్ణయ్య కండువా మీద వేసుకున్నాడు.

విశ్వనాథం "మాస్టరుగారూ, నేను రేపే ఊరికి వెళ్తున్నాను. ఇదే సెలవు. మీ అడ్రసు మారినప్పుడల్లా జాబు వ్రాస్తూండాలి నాయందు దయవుంచి" అని నమస్కరించాడు.

"ఇక్కడ త్రాగుడు ఎక్కువ. కొంతవరకైనా తగ్గించడానికి ప్రయత్నంచేస్తున్నాం" అన్నాడు గోపాలకృష్ణయ్య.

ఎవరి దారిన వారు వెళ్ళారు.

3

"నేను ఇరవయ్యో తేదీన ఇంటర్వ్యూ వుండి హైదరాబాదుకు వస్తున్నాను. మిమ్మల్ని కలుసుకుంటాను. నేను బయలు దేరేలోగా మీ జవాబు వస్తుందని ఆశిస్తున్నాను" అని జాబు వ్రాసి పోస్టు చేశాడు విశ్వనాథం.

జవాబు వచ్చింది.

రైలులో విశ్వనాథం తన మాస్టరుగారిని గురించే ఆలోచిస్తున్నాడు. మాస్టరుగారు ఆర్థికంగా బాగుపడి వుంటారు. పిల్లలు బాగాచదువుకుంటూ ఉంటారు. మంచి యింట్లో వుంటూవుండవచ్చు—మునుపటి ఇల్లు లాంటిది కాకుండా—నవ్వుకుంటూ తల తడుముకున్నాడు. ఆయన యిబ్బందులన్నీ తొలగిపోయి హాయిగా స్థిరపడి వుండవచ్చు.

రైలు దిగగానే బంధువుల యింటికి వెళ్ళి కనపడి తరువాత యింటర్వ్యూ పని పూర్తిచేసుకున్నాడు. గోపాలకృష్ణయ్యను చూడడానికి తహతహ పడుతున్న అతను రిక్షామీద బయలుదేరాడు. గోపాలకృష్ణయ్య ఆఫీసుటైం అయిపోయి బయలుదేరి వెళ్ళబోతున్నాడు. ఇంతలో వచ్చిన విశ్వనాథాన్ని కావిలించుకొని యోగక్షేమాలను విచారించి మనయింటికి వెళ్దాంరమ్మన్నాడు.

గోపాలకృష్ణయ్య వెంట విశ్వనాథం బయలుదేరాడు. నాలుగు దారులు కలిసే చోటు దాటి వంతెనమీదుగా కొంతదూరం వెళ్ళి పల్లంలో వున్న పూరిండ్ల వరుసల మధ్యగా వెళ్తున్నారు. ఒక పూరింటి ముందు పరచిన యీతాకుల చాపమీద ముగ్గురు పిల్లలు పడివున్నారు. తండ్రి నీరసంగా పడుకొని పిల్లలవేపు చూస్తున్నాడు. ఆ పూరిండ్ల మధ్యగా ఒక సన్నని మురుగుకాల్వ పారుతూ దుర్గంధాన్ని పంచుతూవుంది. ఆ పక్కనే ఆ వీధి పిల్లలు ఆడుకుంటున్నారు. ఎలక్ట్రిక్ స్తంభం అక్కడితో ఆఖరు. ఒక ముసలమ్మ తన గుడిసె ముందు చింకిచాపమీద పాతదిండ్లు పెట్టుకొని బోర్ల పడుకొని ఆయాస పడుతూ ఉమ్మేస్తోంది దారిలో. తాగిన తండ్రి తన ఏడేండ్ల కొడుకును అకారణంగా కొడుతూ గోపాలక్రిష్ణయ్యను చూసి సిగ్గుపడి లోపలి కెళ్లాడు. కొన్ని గుడిసెలముందు రిజాలు, త్రోపుడు బండ్లూ విశ్రాంతి తీసుకుంటున్నాయి. ప్రతి గుడిసెముందూ ఒక నీరసపడ్డ కుక్కా ఒక మురికిగుంటా ఉన్నాయి. ఆ గుడిసెలకు తడికలకు, గోడలకు బదులు చింకిచాపలు, పాతపట్టలు అడ్డంగా వేళ్లాడుతున్నాయి. అన్ని మతాలు, అన్ని భాషలు ఆ గూడెంలో వినిపిస్తున్నాయి. అందరిలోనూ వుండే బీదవాళ్ళ గూడెంలా వుంది అది. అందరిలోనూ వుండే దేవుడిలా దరిద్రనారాయణుడు తలెత్తి చూస్తున్నాడు. మలుపు తిరిగినచోట కుక్క పడుకొనివుంది. పక్కకు తప్పుకుపోవడానికి కూడా తగినంత విశాలం లేని యిరుకు. గోపాలకృష్ణయ్య ఆ కుక్కకు కాలు తగలకుండా దాటివెళ్లాడు. విశ్వనాథం భయపడుతూ అలాగే దాటాడు. చివరకు గోపాలకృష్ణయ్య యిల్లువచ్చింది.

"మాస్టరుగారూ, యింతకంటే మంచి పరిసరమూ, గదీ దొరకలేదా యీ మహాపట్టణంలో?" అన్నాడు విశ్వనాథం నవ్వుముఖంతో.

"దొరికించుకోవచ్చు కావాలంటే" అన్నాడు గోపాలకృష్ణయ్య నవ్వుతూ.

విశ్వనాథం ఆ గదిని పరకాయించి చూశాడు. లైటులేదు. ఏ సౌకర్యమూలేదు.. అలమారులో

కొన్ని పుస్తకాలు అడ్డంగా పడివున్నాయి. కొన్ని మందులు, కొన్ని చికిత్సాపుస్తకాలూ ఉన్నట్లు న్నాయి.

కాఫీ తాగారు యిద్దరూ.

"నేను కథలు వ్రాయటం ప్రారంభించాను" అన్నాడు గోపాలకృష్ణయ్య చిరునవ్వుతో.

విశ్వనాథం గోపాలకృష్ణయ్యవేపు చూశాడు. జుట్టు సగానికి పైగా నెరిసిపోయింది. కళ్లులోతుగా ఉన్నాయి. శరీరం ఎండిపోయింది.

"ఇప్పుడా కథలు వ్రాయడానికి ప్రారంభించడం ?" ఆశ్చర్యంతో అడిగాడు.

"ఔను, యిప్పుడే" యిదే సమాధానం అన్నట్లుగా దృఢంగా అన్నాడు గోపాలకృష్ణయ్య.

విశ్వనాథం ఏమీ బదులు చెప్పలేదు. గోపాలకృష్ణయ్య అతని సందేహాన్ని తీర్చడానికి అన్నట్లు అన్నాడు.

"పేరుకోసం కాదు, భవిష్యత్తుకోసం కాదుగా నేను వ్రాయటం ?"

విశ్వనాథం సందేహం తీరినట్లనిపించింది.

"నాకు ఈ నగరంలో చూడతగ్గవేమైనా చూపించరూ ?" అని అడిగాడు.

"నేను రేపు నీతో రాలేను. పాపం, ఒకడికి మిషన్‌లో చెయ్యిపడి తెగిపోయింది. ఎవరూ లేరు. నన్నే నమ్ముకొని వున్నాడు. రేపంతా హాస్పిటల్‌లో సరిపోతుంది."

"అయితే వద్దులెండి. నేనే ఏవేవో చూచి వెళ్ళుతాను. సెలవా !"

అని సెలవు తీసుకొని విశ్వనాథం వెళ్ళాడు.

## 4

చెరువు పూర్తిగా నిండివుంది. స్వామివారి కొండకు వెనుకవేపు అంతా జలమయం. భూదేవత తడిసి సిగ్గుపడుతూన్న అందకత్తెలా వుంది. తడిసిన కొండ స్నానమాడి నిష్ఠకుదిరిన భక్తుడిలా అతిపవిత్రంగా మెరుస్తోంది. దేవాలయం తన అదృష్టానికి మురిసి గర్వంగా కనిపిస్తోంది. చిన్నిచిన్ని మొక్కలు, పెద్దపెద్ద వృక్షాలు కడుపులు నింపుకొని కలకలలాడుతున్నాయి. చిట్టడవిమీదుగా కమ్మని వాసన వీస్తోంది. ఇప్పవనం తళతళలాడుతోంది. అంతా క్షేత్రమహాత్మ్యం అనిపించింది విశ్వనాథానికి. అర్ధనిమీలిత నేత్రాలతో మండపంలో కూర్చునివున్న మాష్టరుగారికి నమస్కరించి విశ్వనాథం ఒదిగి కూర్చున్నాడు ఒకపక్కగా.

"ఎలా వచ్చావోయి యిక్కడికి" అని ఆశ్చర్యంగా అడిగాడు గోపాలకృష్ణయ్య.

"ఈ ప్రాంతాల వరదల పరిశీలనకు ప్రభుత్వం వారి పనిమీద వచ్చి మీరు యిక్కడ వున్నారు గనుక చూచిపోదామని యిలా వచ్చాను"

"విశ్వాసం వున్నది గనుక వచ్చావు. సంతోషం. ఈ రాత్రికి యిక్కడ వుండిపో స్వామివారి సన్నిధిలో."

ఆనాడు పూర్ణిమ. మాష్టరుగారు విశ్వనాథాన్ని కొండమీదికి తీసికెళ్ళాడు. కొండమీదినుంచి వెన్నెలలో, చెరువు, అడవి, ఇప్పవనం, ఆ వూరి పూరిండ్లు, అందమైన ఆకాశం వెలుగులో కొండమీది దేవాలయం. ఎంత పొద్దుపోయిందో తెలియలేదు. విశ్వనాథం పరవశుడైనాడు. గోపాలకృష్ణయ్య చేతికఱ్ఱ సహాయంతో నెమ్మదిగా లేచి, "యిక పోదామా" అన్నాడు. విశ్వనాథం తెలివితెచ్చుకొని మాష్టరుగారిని అనుసరించాడు. గోపాలకృష్ణయ్య ఆలయంముందుకు వెళ్ళి ద్వారంముందు కూర్చున్నాడు.

విశ్వనాథం 'యిక వెళ్ళుదాం' అనలేకపోయాడు.

మాష్టరుగారు అలాగే ఎంతోసేపు ఉండిపోయారు. భక్తి అంటే ఏమిటో విశ్వనాథానికి అర్థమౌతూన్నట్లు అనిపించింది. తెల్లవారుతూండగా గోపాలకృష్ణయ్య నిద్రనుండి లేచినట్లు లేచి 'చెరువు గట్టుకు వెళ్దామా' అన్నారు తెల్లవారుజామున ప్రకృతి ఎంత సుందరంగా వుంటుందో చూపడానికి అన్నట్లు.

విశ్వనాథం కోసం జీపు సిద్ధంగా వుంది. సెలవు తీసుకొని జీపులో కూర్చున్నాడు. కొద్దిగా వణుకుతూ గోపాలకృష్ణయ్య విశ్వనాథం దగ్గరకు వెళ్ళి యిలా అన్నాడు :

"నేను కళ్లుమూశాక ఒక్కసారి యీ యింటికి వచ్చి నేను ఏదైతే వదలిపెట్టి వెళ్ళుతానో దాన్ని ప్రపంచం ముందు పెట్టు."

విశ్వనాథానికి కన్నీళ్ళు నిండాయి. గద్గదకంఠంతో 'తప్పకుండా' అన్నాడు.

"నా కుమారునికి ఆర్థికంగా అంత స్తోమతులేదు. అందువల్ల నీతో చెబుతున్నాను"

"నేనూ మీ కుమారునివంటి వాణ్ణే కదా"

గోపాలకృష్ణయ్య దేవాలయంవేపు- తృప్తిగా- చేతికఱ్ఱ వూతతో పోతున్నాడు. ఉదయకాంతి కొండ మీది ఆలయాన్ని అలంకరిస్తోంది.

విశ్వనాథం మాస్టరుగారివేపే చూస్తూ వుండి పోయాడు.

డ్రైవరు హారన్ వొత్తి జీపును ముందుకు నడిపించాడు.

## మిరియాల రామకృష్ణ | ముక్తి

ఆశ తీగలుసాగి పూచిన
    అలరు తేనెలఁ గ్రోలఁగా
వయసు తుమ్మెద వచ్చి వెడలెను
    వల్లిమొగ్గలు వాడెను.

సుప్తి స్వప్నము లట్లు సూనృత
    సూక్తిదూరము లైన భ్రాంతులు
భానుహృత తిమిరములు కాఁగా
    స్వానుభవ వీథులకు వెడలితి.

పక్ష్మ చలనాంతర గతమ్మగు
    సూక్ష్మ దృగదృగ్భావ మట్టులు
ద్వంద్వశైలీ ఘటిత జీవిత
    భాష నగపడు సత్యముల్.

అంత కన్నుల చదివె తడఁబడి
    స్వాంత కౌతుక మాపఁజాలని
బాల్యదశయో, పండబారిన
    వార్ధకమ్మో కంఠమై!

"భౌతికములగు సుఖపిపాసలు
    పాపకూపములోన త్రోయఁగ
పాప మనెడి పయఃపిహిత విష
    కూపమందున నరుఁడు మిగులున్.

చచ్చిచావని, బ్రతికి బ్రతుకని
    శవము పాపికి సౌఖ్యమనఁగా
ఆయువును క్షీణింపఁజేసెడి
    మాయ రూపము కాదొకో?

మనసు చెడ్డది పాపమందే
    మక్కువను రేకెత్తఁజేయును
మానవునిలో మంచిచెడ్డలు
    మనసు రూపున లేవొకో?

మనసు వాక్కాయమ్ము కర్మయు
    మనుజువర్తన సూచికలుగా
యోగమున సాధించు ముక్తిని
    భోగమున సాధింప నేర్తువా?

నడుమ పొడమిన భాగ్య మట్టుల
    విడిచిపోవును భోగలాలస
కడకు మిగిలిన వడఁకు ముదిమిని
    గడపిపుచ్చుట కడిఁది చెయిదము.

శాంతి-మోక్షాలయ పురఃస్థ
    శాశన క్రియమాణ దీర్ఘిక!
శాంతిదీర్ఘికలోని మెట్టులు
    సమరసీకృత కష్టసుఖములు!

ధర్మరేఖను దాటిపోవని
    కర్మపరునకు యోగభోగో
త్కంఠ శాంత్యానంద దుగ్ధము
    కంఠదఘ్న మొనర్చుగాదే!

యోగ రాగోన్మీలనమ్మున
    త్యాగభోగము లావహిల్లఁగ
పరమ తత్త్వము నెఱుఁగు పుణ్యుని
    పెరటి కల్పక మగును మోక్షము!"

చర్చావేదిక :

## వ్యవహారభాష - వ్యాకరణము

ముప్పై, నలభయ్యేళ్ళ క్రిందటి మాట. దేశంలో స్వాతంత్ర్యాన్ని గురించిన వివాదంతో బాటు ఆంధ్రదేశంలో భాషా స్వాతంత్ర్యాన్ని గురించికూడా తలమున్కలుగా విభేదాలు చెల రేగిన రోజులు. అటు వ్యవహార భాషావాదానికి పెట్టనికోటగా నిలిచిన గిడుగువారూ, ఇటు సనాతనమూ, వైదికమూ అయిన సర్వాంధ్ర దేశమున్నూ. అయినా సత్యం బ్రతికి బట్టకట్టి, గిడుగు వారి తపస్సు ఎంతటి శక్తిమంతమైనదీ, ఈ రెండు మూడు దశాబ్దాల్లోనూ సర్వులకూ తేటతెల్లం చేసింది. ఇంకా విభేదాలూ, సందేహాలూ ఎన్నో వున్నా వ్యవహారభాషలో రచనలు చేయడం సహజమూ, అనివార్యమూ అన్న భావన, ధైర్యం వొకటి యేర్పడి బలపడింది.

కానీ మొన్నటికిమొన్న జయంతి మే నెల సంచికలో శ్రీ జువ్వాడి గౌతమరావుగారి 'వ్యవహారభాష - వ్యాకరణము' అన్న వ్యాసం, దేశంలో ఇంకా ఆ పూర్వసిద్ధాంతాలకు అంటి పెట్టుకుని వున్నవారు లేకపోలేదనీ, వ్యవహార భాషకు 'ఏషువంషి' వ్యాకరణమూ అక్కర్లేదనే వారు వున్నారని, తెలుపుతున్నది. కానీ శ్రీ జువ్వాడివారు తమవ్యాసంలో సమర్థనీయములూ, సమంజసములూ కాని కొన్ని విచిత్రములైన అభిప్రాయాలనుకూడా వెల్లడించారు. వాటిని ఈక్రింద వరుసగా పేర్కొంటున్నాను.

1. వ్యవహార రూపాలను ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా, తెలుగు కావ్యాలలో వున్న ప్రయోగవైచిత్రినంతా విశదీకరిస్తూ, ఒకగ్రంథము వ్రాయటానికి తగినపాండిత్యం ఉన్నవాళ్ళు తెలుగు దేశంలో వేళ్ళమీద లెక్కపెట్టదగినంతమందికూడ లేరు. ఏ యిద్దరు ముగ్గురన్నా ఉంటే వాళ్ళకు అహమస్మిఅని ముందుకువచ్చే సాహసంలేదు. ఒకళ్ళైనా ముందుకు రాకపోవడానికి కారణం హాస్యాస్పదులం అవుతామేమోఅనే భయంచేతనే.

2. నవ్యసాహిత్య పరిషత్తు సృష్టించిన కవులలో అతిరథ మహారథులమని అనుకొనేవాళ్ళుకూడా వ్యవహార భాషలో పద్యములు వ్రాయలేదు. వ్రాస్తే ఆ వ్యవహారభాష వారువ్రాసిన గ్రాంథిక భాషకన్నా అధ్వాన్నంగా ఉండేది.

3. వ్యాకరణాన్ని మీరినంతమాత్రంచేత కఠిన మైన పదాలు వాడినా అది వ్యవహారభాష ఔతుం దనుకోడంకంటె, భ్రాంతి ఇంకోటిఉండదు. నేడు వ్యవహారభాషగా చలామణీ అవుతున్న భాషలో చాలాభాగం ఇల్లాంటిదే.

4. వ్యవహార భాషలో వ్రాస్తున్నా మనుకొనే వాళ్ళంతా కొంత కృత్రిమత్వం పొందిన ఈ కృష్ణా జిల్లా బ్రాహ్మణ భాషకే దాస్యం చేస్తున్నారు. ఇది అక్షరాలా నిజం.

5. మరొక విచిత్ర మేమంటే ఈ వ్యవహార భాషలోని శబ్దస్వరూపం కంటె గ్రాంథిక భాష లోని శబ్దస్వరూపమే తెలుగుదేశంలోని అన్ని జిల్లాల వారు వాడే శబ్దస్వరూపానికి దగ్గరగా ఉంటుంది. గ్రాంథికభాషాస్వభావం తెలుగుదేశంలోని సర్వ ప్రజాభాషాభావానికి దగ్గర.

6. ఇది ఇట్లా వుండగా వ్యవహార భాషా వాదులు ప్రాయికంగా ఆంగ్లభాషా పరిచయం కలవాళ్ళు కాబట్టి ఆ భాషా పదాలు, ఆ వాక్య నిర్మాణ పద్ధతులు ఈ వ్యవహార భాషలోనికి దిగు మతి అయినవి. వీరికి దేశీయమైన విషయాలను చెప్పవలసి వచ్చినప్పుడు కూడా ఆంగ్లవాసన లేకుండా చెప్పడం సకృత్తుగా కాని కనిపించదు. అందుచేత ఒక విధమైన అస్పష్టత ఒక విధమైన కృత్రిమత్వము ఈ భాషయందు దలముకొన్నవి.

7. దీనికి మళ్ళా ఒక వ్యాకరణం దేనికి ? అను శాసనం కాకపోతే వ్యాకరణం యొక్క ప్రయోజనం మరొకటి లేనేలేదు. భాషయొక్క స్వభావం

నిరూపించడం, ఆ స్వభావం యొక్క పరిచయం పాఠకునికి కలగజేయడమే అనుశాసన మంటే.

* * *

ఈ విధమైన వాదనలతో, ఆరోపణలతో సాగి పోతున్నది గౌతమరావుగారి వ్యాసం. అయితే వారు తమ వ్యాసంలో వ్యవహారభాషా స్వరూపాన్ని గూర్చి చర్చించడ మలా వుంచి, కనీసం భాష అంటే యేమిటో, గ్రాంథిక వ్యవహార భాషా భేదాలు అందులో ఎందువల్ల కలిగినవో రేఖా మాత్రంగానైనా వివరించారే కాదు. భాషను గురించీ, వ్యవహార భాషను గురించీ స్పర్శగానైనా పరామర్శించకుండానే వ్యవహార భాషకు వ్యాకరణంఅనేది అక్కర్లేదుఅన్న నిర్ణయానికి రావడం చాల ప్రమాదకరమైన విషయం. వ్యవహారభాష విషయం అలావుంచండి. ఏభాషకయినా వ్యాకరణంఅనేది అడ్డుకట్టవంటిదికదా! పొర్లి పోతున్న భాషా ప్రవాహాన్ని పిల్లకాలువల్లోకి మళ్ళించి సత్ఫలితాల నీయడమే దానిలక్ష్యం. ఏతత్ కారణంచేత వారి ఆరోపణలను గురించి విచారించేముందు వ్యాకరణం అక్కర్లేదన్న వ్యవహారభాషనుగూర్చి ఒకటి రెండు విషయాలు తెలిసికోవలసివుంది.

భాష జడమైనట్టిదీ, చేతనారహితమైనదీ అని ఎవ్వరూ అనుకోరు. మానవుడి ఆలోచన, ఆచరణ పెరిగినకొద్దీ, మారిపోయినకొద్దీ; సంఘమూ జాతీ నాగరికతమూ నాగరికతతోబాటు క్రొత్తక్రొత్త మాటలనూ, వాటిప్రయోగవిధానాన్ని నేర్చుకున్న కొద్దీ గతంలోనేర్చుకున్న, సంపాదించుకున్న, భాష ఉన్నచోటే ఎట్లావుంటుంది? అంటే దీనిఅర్థం గ్రంథస్థం చేయబడినభాష గతించిపోయిన ఒక సంఘస్థితికి చైతన్యరహితమైన వొక చిహ్నం కాగా, వ్యవహారభాష బ్రతికివున్న సంఘానికి చైతన్యవంతమైన ఒక చిహ్నం అవుతుంది.

కాగా, వ్యవహారభాష అనుక్షణం మారిపోతున్నది. దీన్నెలా వొక మూసలో పోసి కరిగించుకోవడం అని కదా జువ్వాడివారి ప్రశ్న? అంత మాత్రమే కాదు, వ్యవహారభాష అనేక మాండలిక భాషలతో కూడుకొన్నట్టిది అయినపుడు వొక్క కృష్ణాజిల్లా మాండలికాన్నే, అందులోనూ ఆ జిల్లాలోని బ్రాహ్మణ భాషనే ఎందుకు శిరస్సున ధరించాలని వారి ఆవేదన. కానీ ఇంతగా వేదనాభరితులైనప్పటికీ, మాండలిక భాషకుగల అర్థాన్ని వారు వివరించనేలేదు.

అక్కడక్కడా ఏవో కొన్ని కొన్ని పదాల ప్రయోగంలో పదాలకు అర్థం చెప్పుకోవడంలో, క్రొత్త క్రొత్త పదాలను సృష్టించుకోవడంలో భేదం కన్పిస్తున్నా ఆ పదాలకు మూలమైన జీవన విధానము, సంస్కృతి, ఆచార వ్యవహారములు అన్నీ స్వల్పమైన మార్పులతో ఏకముఖంగానే ప్రవహిస్తున్నాయి. కృష్ణాజిల్లావారు, గద్వాల అలంపురం ప్రాంతానికి పోయి తమకు సహజమైన వ్యవహార భాషలో మాట్లాడినప్పుడు ఆ వ్యవహార భాషలోని ఒకటి రెండు పదాలు వారికి అర్థం కాకపోవచ్చు గాక, కానీ ఆ గద్వాలప్రాంతం వారు ఈ కృష్ణా ప్రాంతం వారిని తెనుగువారనీ, వీరు మాట్లాడుతున్నది తెనుగేననీ గుర్తించకపోవడం మాత్రం జరగదు.

వ్యవహారభాషను గ్రంథస్థం చేసినప్పుడు కూడా సరిగ్గా జరిగేది ఇదే!

ఒకానొక ప్రాంతంవారు తమకు సహజమైన మాండలిక భాషలో రచనలు చేసినప్పుడు మరో ప్రాంతంవారికి అది అర్థం కాదుగదా? లేక అర్థం చేసికోవడంలో కష్టపడవలెనుకదా? అన్నది సమర్థించుకొనవలసిన ప్రశ్న.

సహృదయ విమర్శకులు శ్రీ జువ్వాడి గౌతమరావుగారు సర్వాంధ్ర రచయితలూ, వ్యవహార భాషలో రచనలు చేసేటపుడు తమ తమ ప్రాంతీయ వాతావరణంలోనే, మాండలిక భాషలోనే ఎందుకు రచనలు చేయరాదు? అని ప్రశ్నించే సమయావ

గూడా, వారు ఇదే ఉద్దేశాన్ని మనసులో ఉంచుకుని ప్రశ్నించి వుండవలె.

నిజమే! ఈ ప్రశ్నకు సమాధానం చెప్పడానికి ముందు మనం వొక్కసారి వెనక్కు తిరిగి, గతంలో ఏ భాషకైనా, ఏ దేశంలోనైనా ఇటువంటి పరిస్థితే ఏర్పడిందా అని పరిశీలించుకోవడం మంచిది. ఈనాటి రచయితల్ని పాశ్చాత్యభాషా వ్యామోహితులుగా, వారిలో "ఆంగ్లవాసనలేకుండా చెప్పడం సకృత్తుగా కాని కనిపించని" విషయంగా ఎల్లాగూ రావుగారు చెప్పనే చెప్పారు కాబట్టి, నేనున్నూ ఆ తెలుగు భాషకూ, ఈ ఆంగ్ల భాషకూ ఎక్కడైనా, ఏ స్థితిలోనైనా పోలికలు వున్నవేమో చెప్పడానికి యత్నిస్తాను.

ఆంగ్లభాషలో 'మధ్యకాలము' అని పిలువబడే పది పదమూడు శతాబ్దాల మధ్యకాలంలో వెస్ట్ మిడ్‌లాండ్స్, ఈస్ట్ మిడ్‌లాండ్స్, సదరన్ డయలెక్ట్స్, లండన్ డయలెక్ట్స అని నాలుగు ముఖ్యమైన మాండలిక భాషలు వాడుకలో వుండేవి. ఈ నాలుగింటిలోనూ కాలక్రమేపీ లండను పట్టణ ప్రాంతంలో మాట్లాడబడే మాండలికానికే ప్రాముఖ్యము వచ్చి, మిగిలిన మాండలికాలు కొన్ని నశించి పోయి, కొన్ని లండన్ డయలెక్టుకు లోబడిపోయి ఈనాడు మనం ఇంగ్లీషు అని చదువుకుంటున్న, మాట్లాడుకొంటున్న భాష వ్యాప్తిలోకి వచ్చింది. ఆ కారణం చేతనే ఛాసర్ కవి వ్రాసిన కాంటర్ బరీ కథలను అందరూ కొద్దో గొప్పో చదవనైనా చదవగలుగుతారు కాని మిగిలిన మధ్యకాలపు ఇంగ్లీషు వాక్యాలను చదవడం కూడా కుదరదు. అయినపుడు ఈ లండన్ మాండలికం ఇంత వ్యాప్తిలోనికి రావడానికి కారణ మేమిటి? సహజంగా ఏ మాండలిక భాష అయినా బాగా వ్యాప్తిలోకి రావాలీ అంటే దానికి శాస్త్రజ్ఞులు ముఖ్యంగా మూడు కారణాలు చెబుతారు. ఒకటి ఆ ప్రాంతానికీ మిగిలినప్రాంతానికీ గల సన్నిహిత సంబంధాలు; రెండు ఆ ప్రాంతం మిగిలిన ప్రాంతాల కన్నింటికీ వర్తక వాణిజ్యాలలోనూ, భాషా విషయంలోనూ కూడలి కావడం; మూడు విదేశీయ వాతావరణంతోనూ, దేశీయ వాతావరణంలోని మార్పులకునూ తొందరగా మారిపోగల సౌలభ్యంవుండడం. లండన్ నగర ప్రాంతాల మాట్లాడే భాష మిగిలిన ప్రాంతాని కంతటికీ, ఎట్టి సంఘర్షణా లేకుండా ఆమోద యోగ్యంకావడానికి ఈమూడు కారణాలే ముఖ్యమైనవి. ఇహ మన తెనుగులోని మాండలికాలు. గౌతములు, కృష్ణాజిల్లామాండలిక భాషలో అందులోనూ బ్రాహ్మణులు మాట్లాడే భాషే సర్వాంధ్ర రచయితలూ, కృత్రిమ వాతావరణానికి అలవాటయి ఉపయోగిస్తున్నా రన్నారు. ఇది పూర్తిగా సత్యదూరమైన విషయం. మన ఆంధ్ర దేశంలోని మూడు ముఖ్యమైన మాండలికాలలోనూ — రాయలసీమ, తెలంగాణా, కృష్ణా గోదావరులలోనూ—సహజంగా కృష్ణా గోదావరి మధ్యస్థ ప్రాంతమే ఒకటి రెండు శతాబ్దాలుగా అభివృద్ధిలోకి వచ్చింది. ఇటు భాషవిషయంలోనూ, అటు వాణిజ్యంలోనూ, ఎప్పుడయితే ఈ ప్రాంతం మిగిలిన ప్రాంతాల అన్నిటిమీదా గైరుగా వుండడం తటస్థించిందో ఆనాడే ఈ ప్రాంతానికి సంబంధించిన భాష 'నేను సుమా!' అంటూ తలెత్తుకుంది. ఇంత వరకూ గౌతమరావుగారితో నేనూ ఏకీభవిస్తున్నాను. ఆ తర్వాత, బ్రాహ్మణులు మాట్లాడే భాష మాత్రమే అసహజంగా అంగీకారయోగ్యమైంది అనడంలోనే వున్నది అసలు పేచీ అంతా.

ఒక్క కృష్ణాజిల్లాలో మాత్రమే కాదు. అటు విజయనగరం మొదలు ఇటు కడపదాకా, ఇటు గురజాల తాలూకానుంచి అటు నల్గొండ జిల్లాలోని మిర్యాలగూడెందాకా, బ్రాహ్మణులందరూ సహజంగా కొంత సుసంస్కృతమైన పదజాలాన్నే వాడతారు. నేనీ మాట ననడం మిగిలిన వారిని చిన్నచూపు చూడాలని కాదు, ఇది యథార్థం కాబట్టి. గద్వాల, అలంపురం, మహబూబ్‌నగరం, వనపర్తి, కర్నూలు, అనంతపురం, బళ్ళారి, కూచర్ల,

గుంటూరు, విజయవాడ, ఉభయ గోదావరులు, శ్రీకాకుళం, పలాసా— ఈ ప్రాంతాలను పరిశీలించినవారికి నామాట సుబోధకమే.

అంతమాత్రమే కాదు.

కృష్ణాజిల్లా బ్రాహ్మణభాష అని ప్రత్యేకం వొక భాష లేదు. కృష్ణా గుంటూరుజిల్లాల అబ్రాహ్మణ భాష అని ప్రత్యేకం వొకటి వున్నది. అది ఆ యా ప్రాంతాన్ని పరిశీలించినవారికి తెలుస్తుంది.

ఇహ రచయితలందరూ ప్రత్యేకం బ్రాహ్మణ భాషనే ఎందుకు వాడతారూ? వో ప్రశ్న. లాక్షణికులు చెప్పినదాన్ని దేన్ని వొప్పుకున్నా వొప్పుకోకపోయినా, సాహిత్య ప్రయోజనాలను వొప్పుకోక తప్పదుకదా! "మంచివాడిగా వుండటానికి ముందు మంచి మాట మాట్లాడు" అన్నట్లుగానే వ్యవహారభాషలో వ్రాసినా, వీరగ్రాంథికంలో వ్రాసినా మంచిపనిని ఉద్దేశించినపుడు, మంచి భాషలోనే వ్రాయవలసి వుంటుంది. నేనిక్కడ 'మంచి' అని చెప్పడం కొంత ప్రయోజనంతోనే. కొన్ని కొన్ని అబ్రాహ్మణ, అసంస్కృత పదాలు ఇతర పదాలతో ఉన్న సామ్యంవలన విపరీతార్థాలను స్ఫురింపజేస్తాయి కొందరికి. అందుచేత రచయితలు సాధ్యమైనంతవరకు వాటిని పరిహరించవలె.

ఉదా: గద్వాల అలంపూర్ లలో :— బుడ్డలు, ఎలికపళ్ళు, బొట్టు.

గుంటూరు ప్రాంతంలో: వేరుశనగలు, వెలగకాయ, కానీ.

ఉదాహరణకు మాత్రమే నేను వీటిని ఇచ్చాను. 'బుడ్డలు' అని అనడంకన్న, 'వేరుశెనక్కాయలు' అని వివరించడం మంచిదికాదా? అదే విధంగా మిగిలిన పదాలున్నూ. వ్యవహారభాషను గ్రంథస్థం చేయవలసివచ్చినప్పుడు ఏ పదానికి శ్రవణసౌభాగ్యం ఎంతవరకు వుంది? ఏ పదం యొక్క ధ్వని ఎల్లా మారుతున్నది? ఏ పదానికి దురర్థస్ఫురణ ఎల్లావుంది? అని ఆలోచిస్తే బావుంటుంది. అప్పుడు వొక వ్యవహార భాషకూ మరొక వ్యవహారభాషకూ- గ్రంథస్థం చేసేసరికి సంఘర్షణ అనేదీ చాలావరకు తప్పిపోతుంది. అది ఏ విధంగా అంటే - కృష్ణా ప్రాంతంలో 'కొట్టు' అనే పదం అంగడికి పర్యాయపదం. 'కొట్టు' అనేసరికి మరొక అర్థం స్ఫురించడం సహజం. అయినప్పుడు సర్వాంధ్ర రచయితలూ 'అంగడి' అనే ఉపయోగిస్తే అది అందరికీ అందుబాటులోనూ వుంటుంది; సులభగ్రాహ్యంగానూ వుంటుంది.

అట్లాగే మహబూబ్‌నగర్ ప్రాంతాన ఆడబడుచును పుట్టింటికి తీసుకురావడాన్ని "తోలుకురావడం" అని వ్యవహరిస్తారు. ఆ తోలుకురావడం, గుంటూరు ప్రాంతంలో పశువు లపరంగానే ఉపయోగింప బడుతుంది.

ఈ విధంగానే ఈ క్రింద ఉదహరించిన పదాలు కూడా.

దొబ్బడం : నెట్టడం. పుట్నాలు : శెనగలు, బేడలు : పప్పుదినుసులు. బొరుగులు : మరమరాలు, మోసంబి: బత్తాయి.

ఇంతమాత్రమేగాదు. సర్వాంధ్ర రచయితలూ 'బ్రాహ్మణ భాష'ను వాడడానికి కారణం తాము వ్రాసేది నాగరికమై,సుసంస్కృతమై వుండవలెననే.

తదుపరి, "కృష్ణాజిల్లా బ్రాహ్మణభాష" తదితర ప్రాంతాలవారికి వీరగ్రాంథికమేనన్న వాదం సంగతి. మిగిలిన ప్రాంతంవారు, వీరికి దాస్యం చేస్తున్నారట. హరిహరీ!! గౌతమరావుగారు వేసిన అభాండాలలోకెల్లా ఇది చాలా తీవ్రమైనది. అసలు భాష విషయంలో దాస్యమేమిటో నాకు అర్థం కావడంలేదు. భాషవల్ల ప్రభావితుడౌతాడు. మానవుడుగా మారతాడు. అంతేకాని దాసుడు కాడు. ఇంగ్లీషు చదువుకున్న నేటికాలపు వాళ్ళను "మీకు తెలియకుండానే మీరంతా ఇంగ్లీషుకు దాస్యం చేస్తున్నారోహోయ్" అంటూ తప్పెట్లు మ్రోగించడం; అట్లాగే హిందీ చదువుకున్నవాళ్ళు హిందీకి దాసులు; ఉత్తరాదివారికి

దక్షిణాదివారు దాసులు!!! పెద్దమనుష్యుల మాటల్నే నమ్మవలసివస్తే ఇందులో కొంత మానసిక దాస్యం; మరికొంత దైహికంగా. ఇప్పుడు గౌతమరావుగారు చెప్తున్నది భాషాదాస్యం, అందులోనూ బ్రాహ్మణభాషాదాస్యం.

కృష్ణాజిల్లా మాండలికాన్ని ఏ రచయితా ఎన్నడూ కావాలని ఎరువు తెచ్చుకోడు. సహజంగా ప్రతి రచయితా, తన భాషాజాలాన్ని అందరూ అభివృద్ధి పరచుకున్నట్లే మూడు విధాలుగా అభివృద్ధి పరచుకుంటాడు. 1. బహుగ్రంథ పరిచయం వల్ల 2. జనతతోడి సాంగత్యంవల్ల 3. తాను నేర్చుకున్నదాన్ని తిరిగి అభ్యాసంలో పెట్టడంవల్ల. అందులోనూ ఈ నాటి రచయితలు సహజంగా, చదువుకున్న వారవడంవల్ల, బ్రాహ్మణభాష వారికి ఈ మూడు విధాలుగానూ లభ్యమౌతున్నది. అంతేకాని వారేమీ దాస్యంచేయడం లేదు. అసలు ఇందులో దాస్యప్రసక్తిలేదు.

కృష్ణాజిల్లా బ్రాహ్మణభాష ఇంకా అనేకవిధాల వ్యాప్తిలోకి రావడానికి శ్రీ గౌతమరావుగారు బహుతేలికైన రెండుకారణాలు చెప్పారు. ఆంధ్ర పత్రిక, ఆంధ్రప్రభ రెండున్నూ కృష్ణాజిల్లా ప్రభావానికే లొంగిపోయినవట. ఆంధ్రపత్రికను ఆంధ్రప్రభ అనుసరించక తప్పలేదట. అయితే ఒక్క సందేహం. సంపాదకులు వారైనంతమాత్రాన సంస్థలో పనిచేసేవారంతా వారు కారుకదా! ఈనాడు ఈ రెండుసంస్థలూ ఆంధ్రదేశంలోని సర్వ మాండలిక సమ్మేళన తీర్థాలుగా వున్నాయి. అందులో పనిచేసేవారిని "ఇదిగో! మీరిక్కడ రాయలసీమ పదం ఉపయోగించారు కాబట్టి కొట్టెయ్యండి" "అయ్యయ్యో. ఇది తెలంగాణా పదమే. పరిహరించండి తొందరగా" పొరపాటున ఆ బ్రాహ్మణపదం అచ్చు పడిపోయింది. కొంచెం సిరామరక వెయ్యండి దానిమీద, ఊ! తొందరగా" అనరుకదా ప్రధాన సంపాదకులు? ఇటువంటివాదనలు వారివ్యాసానికి ఏవిధంగానూ వన్నెతెచ్చేవి కావు. కాదన్నది ఔననడం, ఔనన్నది కాదనడం, ఇంతమాత్రమే కాదుగదా..విమర్శ? ఒకపద్ధతీ ఒకప్రయోజనమూ రెండూవున్నవి దానికి. గౌతమరావుగారి విమర్శకు మాత్రం పద్ధతి సరిఅయినదేకాని ప్రయోజనం అల్పమైనట్టిది.

వారు తమ వాదనలో ఇంతమాత్రంతోనే వూరుకోలేదు. "నియంతృత్వాన్ని కూలదన్నే అభ్యుదయగాముల్ని" కొందరిని సహాయం తెచ్చుకున్నారు. శ్రీ మా. గోఖలే ఈ కృష్ణాజిల్లా బ్రాహ్మణభాషానియంతృత్వాన్ని కూలదోయాలని శతథా యత్నిస్తున్నాడట. నిజంగా ఆయన చేస్తున్నదేగనక ఈ వ్యవహారభాషా వాదాన్ని మొదలుపెట్టిన గిడుగువారి ఉద్దేశ్యమైతే ఈ ఉద్యమం ఇంతకాలం వూపిరి నిలుపుకొనేదేకాదు. ఎల్లాచెప్పాలనికాదు, ఏంచెప్పాలని. ఎంత సుందరంగా, ఎంతజాతీయంగా, ఎంత సూటిగా హృదయానికి తగులుతున్నదని. నేటి వీర వ్యవహార భాషావేత్తల తాపత్రయమల్లా దీనికోసమే శ్రీ మా. గోఖలే చేస్తున్న ప్రయోగమల్లా ఎట్లా చెప్పాలని. ఏం చెప్పాలనికాదు.

ఈ చెప్పడాన్నిగురించే గౌతమరావుగారు మరిరెండు విసుర్లు విసిరారు. నిజమే! నవ్య సాహిత్య పరిషత్తువారు, సూర్యుణ్ని అందుకోబోయిన హనుమంతుడిలాగా తయారయ్యారు. వారు వ్యవహారభాషలో పద్యాలు వ్రాయలేదు. వ్రాసిన ఒకటి రెండూ పద్యాలు కాలేకపోయినాయి. కృత్రిమములయినాయి. అంతమాత్రాన? హిమాలయ పర్వతశిఖరం అధిరోహించాలని ఎన్నోసార్లు ప్రయత్నించినతర్వాత ఎందరో బలి అయిపోయింతర్వాతకదా టెన్‌సింగ్ ఆ ఘనకీర్తిని దక్కించుకొంది? భగీరథసాధనం మనకు తెలిసిన సంగతే. దురదృష్టవశాత్తూ వొక్క నవ్యసాహిత్య పరిషత్తే జువ్వాడివారి దృష్టికి తగిలింది.

కానీ ఏస్థితిలోనూ, ఏసంస్థతోనూ సంబంధం పెట్టుకోకుండా ఏకాకిగా, తనునమ్మిన సత్యంకోసం తన జీవితాన్నే పణంగాపెట్టి బ్రతుకుతున్న శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి గారు వారిదృష్టికి అందారేకాదు. శ్రీపాదవారు శతావధానంచేసి, విమర్శలువ్రాసి, గద్యాన్ని పద్యాన్ని సమంగా నడిపిస్తూనడిపిస్తూ జ్ఞానసముపార్జనంవల్ల, అనుభవం నేర్పిన పాఠంవల్ల పద్యాన్నివదిలి గద్యాన్ని గ్రహించిన మనీషులు; అందులోనూ వీర వ్యావహారికవాదులు. ఇన్ని మాటల నా వాదనకన్నా, వీరవ్యవహారికాన్ని, శిష్టవ్యవహారికాన్ని గ్రంథస్థం చేయవచ్చోలేదో వారి చిన్ననవలలు, నాటకాలు, కథలు చదివితేతెలుస్తుంది. అందులోనూ ఇపుడిపుడే వెలుగు చూస్తున్నవారి "అనుభవాలూ - జ్ఞాపకాలూనూ" చదివితే మరింత బాగాతెలుస్తుంది. వారు క్రియలోచేసి చూపించినదాన్ని నేను మాటల్లో ఏం చెప్పగలను ?

మరొక్క విశేషం. ఈనాటి విమర్శకునికి ఇది ఒక అలవాటయిపోయింది. నేటి రచనకు దేనినో ఒకదాన్ని తీసుకుని, ఏ నన్నయ్యతోనో, తిక్కన్న తోనో లేక ప్రెగ్గడతోనో పోల్చడం. మహాకవి ప్రతిభను గురించీ, తెలుగువాడి వైఖరిని గురించీ గౌతములు కొంత మాట్లాడారు. మహాకవి ప్రతిభ అనేది ఎప్పుడూ "త్రికాలబాధ్యము". దాని కీ కావ్యభాష అనీ, వ్యవహార భాష అనీ భేదం వుండదు. జీవుడు వేదన ననుభవించడంలోనూ, జాతి నాడిని పరిశీలించి వ్రాయడంలోనూ వున్నది నేర్పంతా. అయినపుడు మానవుని మేధలో గర్భితమై వున్న శక్తిని భాషకు అంటగట్టడం దేనికి? భాష అనేది వొక సాధనం మాత్రమే. షేక్స్పియరుకన్నా, బెన్‌జాన్‌సన్ మహాపండితుడని పండితుల అభిప్రాయం. కానీ జనావళి దేనికెంత విలువ నీయాలో సులభంగానే గ్రహిస్తుంది.

ఈ విధమైన వాదన చేస్తూనే, అభ్యుదయకవిత్వానికి, వ్యవహార భాషా వాదానికి సంబంధం కల్పించారు గౌతమరావుగారు. ఇది కొంచెంగా తొందరపాటు నిర్ణయం. అభ్యుదయభావనా భాసితమైన కవిత వ్యవహార భాషలో రచింపబడి వుండక పోవచ్చు. వ్యవహార భాషలో రాసినప్పటికీ ఆ రచన అభ్యుదయ కవితోద్యమానికి వెన్నుపోటు పొడిచేది కావచ్చు, అయితే వొకటిమాత్రం నిజం. "అందరికీ అర్థమయ్యేట్టు వ్రాయాలన్న ఆశయం" ఒకానొకప్పుడు రెండింటికీ సమానమైన ధర్మం. అయితే ఇప్పటికీ వ్యవహారభాషావాదానికి అదేపట్టుగొమ్మగా వుంది. కానీ అభ్యుదయకవిత్వలక్ష్యమూ తత్వమూ, మాత్రం, రోజుకు రోజుకూ వొక్కో క్రొత్త అర్థాన్నీ, పదార్థాన్నీ తొడుక్కొంటోంది. అభ్యుదయ కవిత్వోద్యమ వ్యాప్తికి ఎవరో కొందరు వ్యక్తులు ముఖ్యం. వ్యవహార భాషా వ్యాప్తికి సంపూర్ణమైన సంఘచైతన్యం కారణం. అందుచేత శ్రీరంగం శ్రీనివాసరావులూ, ఆరుద్రలూ ఏమి రాసి, ఎంత 'ఫెయిలు' అయినా అది వ్యవహార భాషావాదానికి సంబంధించిన వ్యవహారం కాదు.

అతర్వాత జువ్వాడివారు వ్యవహార తత్వాన్నీ, గ్రాంథిక భాషా తత్వాన్నీ కొంతగా విపులీకరించారు. గ్రాంథిక భాష అందరికీ సుబోధకమట ! ఒక ఉదాహరణ :

"అంతట విష్వక్సేనుండు వేత్రహస్తుండై అందరి నెడగలుగ జడియుచు బరామరి యొనరింప, దివ్య వారాంగనా నాట్యంబు నవలోకించు నద్దేవ దేవుండు పేరోలగంబున నున్న సమయంబున."

ఈ గ్రాంథిక భాష ఎంతమందికి సుబోధకమో జువ్వాడివారు, ఇహ లెక్కలువేసి మాత్రమే చెప్పవలసి వుంటుంది. అలా అని పాత్రోచిత సంభాషణలో వున్న వ్యవహార భాష కూడా సుబోధకమని నే ననడంలేదు.

"ఫ్రెండ్స్ ఆఫ్ పీపుల్ మజ్జనుంచి ఎమ్మెల్యే, డాక్టర్, వాడెట్లా ఎస్కేప్ చేసెనండి! బ్యూటిఫుల్! ఫ్లాడూ యూసే !"

పైన వున్న వీరగ్రాంథికం, పల్లెటూరి తెనుగు యువకుడికి ఎంత సులభ గ్రాహ్యమో, క్రిందనున్న వీరవ్యవహారికమూ, ఆ యువకుడికి అంతే అర్థ మౌతుంది. ఏతత్కారణంచేత ఎక్కడైనా, ఎప్పుడైనా 'వీర' లేకపోతే ఏదైనా ధారకమే అవుతుంది.

ఇహ వ్యాకరణాన్ని గురించి వొకటి రెండు మాటలు. వ్యాకరణంయొక్క పరమ ప్రయోజనం అనుశాసనమని గౌతమరావుగారే అంటున్నారు. భాషయొక్క స్వభావాన్ని నిరూపించడం అత్యవసరం అనిన్నీ వారే వొప్పుకుంటున్నారు. భాషా స్వభావ పరిచయంవల్ల ప్రాణం పట్టుకోవడం తెలుస్తుందనీ వారే చెప్తున్నారు. మరి భేదమల్లా యెక్కడ ? వ్యవహారికానికి నియమ రాహిత్యమే పరమ ప్రయోజన మంటారు గౌతమరావుగారిలాంటివారు. ఆ నియమ రాహిత్యాన్ని తీసివేయవలెననే నేటి వైయాకరిణి ప్రయత్నం చేస్తున్నాడు. అయినపుడు నియమవర్తనం ఇష్టమైనప్పుడు గ్రాంథిక భాషనే ఎందుకు స్వీకరించరాదంటారు. నేను వెళ్తున్నాను. అని మాట్లాడే విధంగా రాయడం తెలుగువాడికి దగ్గరగా వున్నదో లేక "నేను వెడలుచున్నాను." అని వ్రాయడం తెలుగువాడికి స్వభావసిద్ధమైనట్టిదో గత నాలుగు దశాబ్దాల చరిత్రా నిరూపించింది. ఇప్పుడు నేటి వ్యవహారభాషా వాదులు, గౌతమరావుగారు ప్రాతినిధ్యం వహిస్తున్న పండిత కవుల్నీ, కవి పండితుల్ని అడిగేది వొకటే "నేను పోతున్నాను" అన్న వ్యవహారరూపాలు, ఏయే మార్పులు చెంది ఈ స్థితికి వచ్చాయో తెలియ జెప్పమనే. అంటే, ఈనాడు దేశానికి అవసరమైనది భాషాపరిణామాన్ని తెలియజెప్పే వ్యాకరణం. నేటి వ్యవహారభాషా పదాలు, గ్రాంథిక భాషా తత్వాన్ని పొదుపుకున్నట్టివి. నేటి తెనుగు మనిషికి వ్యవహారరూపాలూ, గ్రాంథిక రూపాలూ రెండు రెండు నాడులు. కానీ ఆ నాడీతత్వాన్ని తెలుసుకోడానికి సమగ్రయత్నమే కొఱవడుతున్నది. ఈ భాషావాదనలవల్ల ఆ యత్నం నశిస్తోంది.

—*కొండముది శ్రీరామచంద్రమూర్తి.*

## వ్యాకరణం : వ్యావహారికం

జయంతి యేడో సంచికలో వాడుకభాషకి వ్యాకరణం అనవసరమని సిద్ధాంతీకరిస్తూ శ్రీ గౌతమరావుగారొక వ్యాసం ప్రకటించారు. అందులో వారు కొన్ని ఆలోచించి చర్చించదగిన వాదనలు చేశారు.

దాదాపు అర్ధశతాబ్దం కిందట గ్రాంథిక వ్యావహారిక భాషల్ని గురించి పండితులు వాదోపవాదాలు చేసుకొన్నారు. కాలక్రమాన ఆ చర్చే మరుగు పడిపోయింది. వాడుకభాషా ప్రయోజనాన్ని చాలామంది పెద్దలు గుర్తించి తమ విజ్ఞతకి మెరుగు పెట్టుకున్నారు. ఇవాళ వాడుక భాషా ప్రయోజనాన్ని గురించిన చర్చ గత శతాబ్దాన్ని గురించిన చర్చలాంటిది.

ఇన్నాళ్ళతరువాత మళ్లీ ఈ వివాదం పాత పద్ధతుల్లోనే తలెత్తుతున్నది. అందులో జయంతి పత్రిక గ్రాంథికభాషా పునరుద్ధరణోద్యమానికి నాయకత్వం వహిస్తూ రంగంమీద నిల్చింది. అసక్తిజనకమైన చర్చలే సాగుతున్నవి.

గౌతమరావుగారి ప్రస్తుత వ్యాసంలో తిరిగ్గా పరిశీలించే అంశాలున్నవి. వాటిలో కొన్నిటిని పరామర్శించటమే నా ఉద్దేశం.

ప్రాచీన కావ్యాల్లోని ప్రయోగ వైచిత్రిని వివరిస్తూ యింతవరకెవరూ వొక గ్రంథం ప్రకటించలేదు. అసలంత సామర్థ్యంవున్న వాళ్ళు కూడా లేరని గౌతమరావుగా రభిప్రాయపడ్డారు. ఉన్నారో లేరో యెవరికి తెలుసు గాని పూర్వ కవుల ప్రయోగ వైచిత్రిని గమనించటానికసలు వాళ్ళ పుస్తకాలచ్చులో చెడకుండా వుంటేగదా. అచ్చయిన వ్యాకరణాల తడాఖాకి అచ్చుకాని పూర్వకావ్యాలు భయపడి రూపంమార్చుకున్నవి.

గ్రాంథిక భాషకే యింత కష్టమైనప్పుడు దారీ తెన్నూ లేని వ్యవహార భాషని వ్యాకరించటం సంగతి వేరే చెప్పక్కర్లేదంటారు గౌతమరావు గారు.

దారీ తెన్నూ లేని భాషంటూ వుండదు. భాష తన స్వభావానికి సహజమైన పద్ధతిలో మారుతూ దారి నేర్పర్చుకుంటుంది. దాని దారినే మనం గమనించాలి. ఆ దారిలో తప్పనిసరిగా ఒక క్రమత వుంటుంది. దాన్ని నిరూపించటమే వ్యాకర్తలు చెయ్యవలసిన పని. అటువంటప్పుడు వ్యవహార భాషకి వ్యాకరణం కావాలనుకోటంలో గౌతమ రావు గారికి గోచరించిన చమత్కార మేమిటో మరి? భాషా స్వభావాన్ని నిరూపించటమే వ్యాకరణ ప్రయోజనమని వీ రొప్పుకుంటున్నారు. మరి వ్యవహారభాషకినిరూపించటానికో స్వభావమంటూ వుండదనా వీరి వుద్దేశం?

భాష మారుతూవుంటుంది. ఇది పదేపదే చెప్పక్కర్లేని నిర్వివాదాంశం. గ్రాంథికమని వీరనుకొంటున్న భాష కూడా ఇందు కపవాదం కాదు. భగవంతుడే మారుతున్నప్పుడు భాష ఆగుతుందా?

వాడుక భాష కిప్పు డొక వ్యాకరణం రాస్తే మరు సంవత్సరానికది పాతబడుతుంది కదా! అటువంటప్పుడు దానికి వ్యాకరణ మేమిటి? అనే అభిప్రాయంలో వున్నారు గౌతమరావుగారు. అంటే వ్యాకరణం మారనిది అనేగా దీని సారాంశం? మాటవరసకి వాడుకభాషని పుస్తకాల్లో వాడటం మానుకోని, వా రభిలషిస్తున్నట్టుగా గ్రాంథిక మనబడుతున్న భాషనే రాద్దామని పూనుకున్నా మనుకోండి. ఏది గ్రాంథికమో ఎవరైనా నిరూపించగలరా? పోనీ నిరూపించారే అనుకోండి. (అది అసాధ్యమన్న సంగతి వేరే చెప్పక్కర్లేదు.) దాన్ని మారకుండా వ్యాకరణ చట్రంలో బిగించగలరా? వ్యాకరణాలు మాత్రం మారకుండా వుండటం సాధ్యమా? ఏ భాషా వ్యాకరణమైనా, ఏ కాలపు వ్యాకరణమైనా ఇంతవరకూ మారకుండా లేదు.

గౌతమరావుగా రనుకొంటున్నట్టు "వ్యవహార భాష ఇట్లా వుంటేనే బాగుంటుందని గిడుగువా రెప్పుడూ అనుకోలేదు. ఆయనే ఒకచోట రాస్తూ "ఈ గట్టు నన్ను కట్టమన్నారు. అది నాకే కాదు, ఎవరికైనా అసాధ్యమే" అన్నారు. భాషకి గట్టు కట్టటం రామ్మూర్తి పంతులుగారి వుద్దేశం కానే కాదని స్పష్టంగా తెలుస్తూవుంది గదా!

వ్యావహారిక భాషకి వ్యాకరణం రాయాలంటే ఏది ప్రమాణంగా తీసుకోవాలి? రాసే భాషా? మాట్లాడే భాషా? అనే సందేహం గౌతమరావు గారితో బాటు చాలామంది కున్నట్లు కనిపిస్తున్నది. ఇవ్వాళ వ్యాకరణ రచనఅంటే ఒక వ్యక్తి గ్రంథాలయంలోనో, యింట్లోనో కూర్చుని చేసిపారేయ గలిగింది కాదు. దేశంలో వివిధ మండలాల్లో భాషా స్వరూపం ఎట్లా వుందో సుశిక్షితులైన కొందరు పరిశోధకు లా యా మండలాలు పర్యటించి, పరిశోధించాలి. అప్పు డా యా మండలాల భాషా స్వరూపాన్ని నిర్ణయిస్తూ వేర్వేరుగా మాండలిక వ్యాకరణాలు రచించాలి. అప్పుడు ప్రస్తుతానికి ప్రామాణికాంధ్ర మేదో నిర్ణయించటానికి కొంత వీలుకలుగుతుంది. అప్పుడు ప్రామాణికమైన వ్యాకరణ రచన సులువవుతుంది. అందు కుదాహరణ ప్రాయంగా సర్కారు జిల్లాల్లోని కొన్ని హల్సంధి రూపాల్ని వ్యాకరిస్తూ డా. భద్రిరాజు కృష్ణమూర్తి గా రొక వ్యాసాన్ని ప్రకటించారు. అందులో ఆయ నవలంబించిన సూత్ర నిర్మాణ పద్ధతి కూడా పరిశీలించ దగిందే. పూర్వ పర హల్లుల మధ్య నున్న అచ్చుపోయి, పూర్వహల్లు పర హల్లుగా మారే సంధికార్యాన్ని ఆయన "$c^1 v c^2 > c^2 c^1$" అని సూత్రీకరించారు. సాంప్రదాయికమైన పద్ధతిలో రచించిన వ్యాకరణంలో 28 సూత్రాల్లో చెప్పిన అంశాలు ఈ కొత్త పద్ధతిలో మూడు సూత్రాల్లో యిమిడిపోయినవి.

వాడుక భాష ననుశాసించటాన్ని గురించి రామ్మూర్తిపంతులుగా రొకసారి రాస్తూ యిటు

వంటి అభిప్రాయాన్నే వెలిబుచ్చారు. "శాస్త్రులు గారు తెలుగుభాషను అనుశాసించవలసినదని నన్ను నియోగించినారు గాని ఆ పనికి నేను పూనుకో గలనా? శాస్త్రిలుగారివంటివారు నూరుగురు సహాయులు అన్ని మండలములలోనూ పది సంవత్సరాలు శ్రద్ధతో పనిచేస్తే కొంతమట్టుకు ఆంధ్ర భాషను అనుశాసించవచ్చును" అని రాశారు. ఆ సందర్భంలోనే పరమైకత గల భాష లోకంలో ఎక్కడా లేదనీ, దానికోసం మనం పరితపించక్కర్లేదనీ, పండితుల ప్రయత్నంవల్ల అది రాదనీ స్పష్టపరిచారు.

ఆ కాలపు శిష్టుల భాషే అప్పటి గ్రాంథికమవుతుంది. నన్నయ్యా కానీ, తిక్కయ్యా కానీ ఒక శుభోదయాన కూర్చొని పదాల్ని సృష్టించలేదు. అప్పటి వాడుకలో వున్న రూపాల్ని గ్రహించి గ్రంథాల్లో వాడుకున్నారు. మరి నేటి కవులు వాడుక భాషలో కావ్యాలు ఎందుకని రాయటం లేదు? అనే ప్రశ్న వస్తుంది. పద్య రచనలో ఇంకా పాతపద్ధతుల మత్తు వదలకపోవటమే అందుక్కారణం. అంతేకాని అది అసాధ్యమైన విషయం మాత్రం కాదు. సందేహం వుంటే ఆరుద్ర రాసిన 'పంచాంగశ్రవణం' చదవొచ్చు.

వాక్య నిర్మాణాన్ని గురించిగూడా గౌతమ రావుగారు కొంత చర్చచేశారు. అది చాలా అస్పష్టంగా వుంది. కొన్ని వుదాహరణలైనా చూపిస్తే బాగుండేది. న్యాయానికి రాతలోనూ, మాట్లాట్టంలోనూ వాక్య నిర్మాణం ఒకటే. కుదింపు, వ్యంజకత్వం, 'స్వాభావికత' అనేవి వైయక్తిక ప్రతిభ ననుసరించి వుంటాయి. అవన్నీ రాతలోనూ, మాట్లాట్టంలోనూ సమంగానే వుండొచ్చు.

వారు వాక్య నిర్మాణాన్ని గురించి చెప్పిన దాంట్లో పరస్పర వైరుధ్యం కూడా వున్నట్లు కనిపిస్తున్నది. ఒకే పేరాలో వున్న ఈ వాక్యాల్ని గమనించండి.

1. మాట్లాడటంలో ఉన్న స్వాభావికత, వ్యంజకత్వం వ్రాతలో ఉండదు.

2. తెనుగువాడు ఒక భావాన్ని వ్యక్తం చేసేటపుడు వాక్యనిర్మాణం ఎట్లా చేస్తాడో వారు (పూర్వ మహాకవులు) బాగా పరిశీలనచేసి రాశారు.

3. భావానికి సహస్రముఖము లుంటవి. ఏ ముఖమునుండి భావాన్ని ప్రకటించినపుడు తెలుగువా డేవిధమైన వైఖరిని అవలంబిస్తాడో దానిని పట్టుకొని వ్రాయడంలో మహాకవి ప్రతిభ అంతా ఉంటుంది.

వీటి సమన్వయం ఎట్లా ?

"...తాను మాట్లాడినట్లే తాను వ్రాయలేడన్నది నూటికి నూరుపాళ్ళు యథార్థము. ఈ దృష్ట్యా చూస్తే నేటి వ్యవహార భాషావాదులు వ్రాసే భాష అంతా బహు కృత్రిమమైనది" అని గౌతమరావుగా రంటారు. మనుషుల వుచ్చారణకి తగినన్ని సంకేతాలు భాషలో లేనట్లే మనుషుల ఆలోచనల్ను తెలుపుకోటానికి తగినంత పదజాలం కూడా లేదన్నది యథార్థమే కదా! గౌతమరావు గారిదృష్ట్యా చూస్తే మాట్లాట్టమే కృత్రిమ మనాల్సి వస్తుంది. అందుకని మాట్లాట్టం మానేస్తామా ? ఉచ్చారణలో వున్న ధ్వనులన్నిటికి తగినన్ని సంకేతాలు ఒక్క మన భాషలోనేకాదు ఏభాషలోనూలేవు. అందువల్ల ఎవరురాయగల్గినా మాట్లాడేపద్ధతికి సాధ్యమైనంత దగ్గరగా మాత్రమే. అట్లాఅనిచెప్పి మాట్లాడేదానికి ఆమడ దూరానున్న భాష రాయాలనటం సమర్థనీయ మవుతుందా ?

వాడుకభాషకున్న ప్రయోజనాల్లో అర్థం కావటమనేది ఒక ప్రయోజనం మాత్రమే. వారన్నట్టు విషయాన్నిబట్టికూడా అర్థంకావటమనేదుంటుంది, వాడుకభాషలో రాయటంవల్ల నుడికారపుసొంపు చెడకుండా భద్రపరచొచ్చు. వాడుకభాషలో చెప్పింది వినేవాళ్ళకి ఎక్కువ నన్నిహితంగావుంది. వాడుకభాషలోరాసే రచనే అందంగా వుంటుంది. పూర్వకవుల కావ్యాల్లో

అందంలేదా ? అనొచ్చు. అప్పటి అభిరుచులు వేరు. నా వుద్దేశంలో అందంకోసమే వ్యావహారిక భాష రాయాలి. ఇదే ప్రధానమైన ప్రయోజనం.

ఇవాళ తెలుగుదేశంలో అంతా ఒకేరకమైన భాష మాట్లాట్టంలేదనేది వాస్తవమే. మన ప్రజల్లో చదువుకోనివాళ్ళసంఖ్య ఎక్కువ. విద్య, ప్రయాణ సౌకర్యాలు యింకా విస్తృతమైన్నాడు ప్రజల మధ్య సంబంధబాంధవ్యాలు పెరిగి భాషలో ఒక రకమైన ఏకత రాకపోదు. గ్రామీణ కుటుంబాల్లో నుంచివచ్చిన విద్యావంతుల్లో కొంత సంస్కారం వస్తుంది. అన్నిప్రాంతాల భాషలో నాగరికులు మాట్లాట్టంలో కొంత ఏకతవుండకపోదు. పరస్పరం అర్థమవుతూనే వుంటుంది. ప్రయోగ వైవిధ్యం వుంటే అదీ పరిగ్రాహ్యమే అవుతుంది. ప్రాచీనులు మాత్రం ఒకేపదానికి వివిధరూపాలు ప్రయోగించ లేదా ? ఇపుడు నాగరకులు మాట్లాడుతున్నది కృష్ణాజిల్లా బ్రాహ్మణభాష అనటం అన్యాయం. అంతేకాక వర్ణవిభేదాల విషవాతావరణం మన్ని యిప్పటికే కావల్సినంత నాశనంచేసింది. ఇప్పుడది భాషా వివాదంలోకూడా ప్రవేశించిందంటే అవాంఛనీయమైన పరిస్థితులకి దారితీస్తుంది.

గౌతమరావుగారి మరో విచిత్రమైన వాదం వ్యవహారభాషలోని శబ్దస్వరూపంకంటె గ్రాంథిక భాషలోని శబ్దస్వరూపం అన్ని జిల్లాలవారువాడే శబ్దస్వరూపానికి దగరగావుంటుందని. దీనికాధార మేమీ వారు చూపలేదు, పైగా వాడుకభాషకన్న ప్రజలకి భారత భాగవతాదులు సులభంగా అర్థ మవుతాయట. ఇది పూర్తిగా అసత్యం. భారత భాగవతాదులు చదువుకున్న వాళ్ళకైనా అర్థం కావటంకష్టం. పండితులకూడా కొరుకుడుపడని చోట్లనేకం యిప్పటికే వున్నవి. ఇటువంటి వాదానికి రామ్మూర్తి పంతులుగారు సమాధానంచెప్తూ "తెలుగుభారతం దేవాలయాల్లోనూ, దుకాణాల దగ్గరా కంఠోపాఠం చేయబడుతున్నదని మాకు చెప్పకండి. దానిని ఒకపండితుడు చదువుతుంటే మరొకడు నేటి జీవద్భాషలో వివరిస్తున్నాడని మాకు తెలుసు" అన్నారు.

వ్యవహార భాషావాదులు ఆంగ్లభాషాపరిచయం కలవాళ్ళయినందున ఆంగ్లవాసన లేకుండా రాయలేక పోతున్నారని గౌతమరావుగారివాదం. ఒకభాషకున్న వాక్యనిర్మాణం ఆభాషకి సొంతం. ఇంకోదాంట్లో సాధారణంగా రాదు. వచ్చినా అతకదు. భాషాతత్వాన్నెరిగిన పెద్దలుచెపుతున్న విషయంఇది. కాకపోతే కొన్నిపదాలు దిగుమతి కావచ్చు. దానివల్ల నష్టంకూడా ఏమీలేదు. ఇక మరీ ప్రధానమైన ఆరోపణ వాళ్ళకి సంస్కృతాంధ్రాలతో తగినపరిచయం లేనందువల్ల ఏవో తప్పులు చేస్తున్నారనీ. వాటిని సమర్థించుకోటానికే వ్యాకరణం కావాలంటున్నారనీ, దోషాలని సమర్థించాలని ఎవరూఅనరు. వాటిని సాధ్యమైనంత వరకూ తగ్గించాల్సిందే. వాటికి తగిన కట్టుబాటేర్పరచుకోవచ్చు. అయితే తప్పులంటే ఒక భాషా పదాలు ఇంకో భాషలలోకి దొరబడేటప్పుడు జరిగే మార్పులూ. సంతరించుకునే అర్థాలూ కావనుకుంటా. తప్పుల మాటకొస్తే గ్రాంథిక భాష రాస్తున్నా మనుకునేవాళ్ళు చేసేవి అల్ప సంఖ్యలో లేవు. అసలు వాళ్ళే ఎక్కువచేస్తున్నారు. అటువంటివాటిని తనకాలంలో గిడుగు రామ్మూర్తిపంతులుగారెన్నో ఎత్తి చూపించారు. చేయదల్చుకున్న వాళ్ళ కాపని ఇప్పుడు సాధ్యమే.

శిష్ట వ్యావహారికాన్ని గురించి విద్యావంతుల్లో కొంత సందేహముంది. ఆకాలపు చదువుకున్న వాళ్లే ఆకాలపు శిష్టులు, వాళ్ళు మాట్లాడేభాషే శిష్ట వ్యావహారికం. ఏ గిడుగో, ఏ చెళ్ళపిళ్ళో మాత్రమే శిష్టులని ఎవరూ అనరు. వాళ్ళూ అట్లా అని ఎప్పుడూ చెప్పలేదు. అంతేకాదు, వారురాసిన భాష ఇప్పుడు మనకొకింత పాతగానే కనిపిస్తుంది. రామ్మూర్తి పంతులుగారైనా తాము రాసినభాషే ప్రామాణికమనీ, అదే సర్వకాలానికీ అనుసరణీయ మనీ చెప్పలేదు. గిడుగువారంటారూ: "నాభాష

పందొమ్మిదో శతాబ్దిదనిన్నీ అది నేటి వారి కనుక రణయోగ్యము కాదనిన్నీ కామేశ్వరరావుగారు అన్నారు. అవును; నేను ఆ శతాబ్దిలో పుట్టి పెరిగిన వాడను గనుక అప్పటి భాష నాకు అలవాటయినది. వారిభాష వారి మనుమలకు పాతభాష అవుతుంది. అందులో వైపరీత్య మేమీలేదు; హానీలేదు."

వ్యాకరణ నియమా ఉల్లంఘించాలన్న పట్టుదల యెందుకు? అని అడుగుతున్నారు గౌతమ రావుగారు. పట్టుదల తప్పకుండా అవసరం. తమ కాలానికి సరిపోని నియమాల్ని ఒక్క భాష విషయంలోనే కాదు. రాజకీయ సాంఘిక విషయాల్లో కూడా ఛేదించక తప్పదు. పూర్వకవులు భాషా స్వభావం తెలిసిన మహాకవులే అయినా తమ కాలపు భాషా స్వభావాన్ని మాత్రమే వారెరుగుదురు. రాబోయేకాలంలో ఏమార్పులు జరుగబోతున్నాయో వా ళ్ళే మెరుగుదురు? ఇప్పటి మహాకవులైనా అంతే.

అసలు వ్యాకరణమంటే గౌతమరావుగారి అవగాహనతోనే పేచీ వొస్తున్నది. వ్యాకరణాన్ని మీరటం, తిరస్కరించటం అనేమాట లే అర్థాల్లో వాడారో, నన్నయ రాసినట్టు తిక్కన రాయలేదు. తిక్కన అనుసరించిన నియమాల్నే తూచా తప్పకుండా తరవాతివాళ్లు అనుసరించలేదు. అయినపుడు మనంమాత్రం కొంతవరకు గీత గీసుకొని అంతవరకు వాళ్ళు వాడినవే స్వీకరించాలి అని ఎందుకు మడిగట్టు క్కూర్చోవాలి? కేవలం పాత మీద గౌరవంవల్ల వాళ్ళ నియమాల్ని వివేచన లేకుండా మనమెందు కనుసరించాలి?

ఇంతకి నేటి వాడుకభాషకి వ్యాకరణం కావాలనుకోటం ఇప్పటి భాషా స్వభావాన్ని నిరూపించటంకోసమే. రాసేవాళ్ళంతా వ్యాకరణాలు చదివే రాయటంలేదు. చదివి రాసిన వాళ్ళవే గొప్పగా వుంటాయని అనలేం. రాసేవాళ్లకి వ్యాకరణాలతో పనిలేదు. ఇప్పుడు భాష యిట్లా వున్నదని, అందులోని క్రమత నిరూపించటం వ్యాకరణం ప్రయోజనం. శక్తిమంతులైన రచయితలకి వ్యాకరణాలు ముద్రవేసినా ఒకటే, వెయ్యకపోయినా ఒకటే. ప్రాచీనకవుల్లో వ్యాకర్తలు ముద్ర వెయ్యనివాళ్లు నిలవకుండా పొయ్యారు గనుకనా? "శిష్టా నాముక్తా సూత్రాణామభావే అను శాసన కారిణ ఏవ దండనీయాః"

ఇంతవరకు పైనచెప్పిన విషయాలు ఏమాత్రం కొత్తవిగావని నాకు పూర్తిగా తెలుసు. పాతబడ్డ వాదాలకిచ్చే సమాధానాల్లో కొత్తదనా న్నాశించటం కష్టమే మరి.

—జలాంతర్భంద్రచపలం.

## ఆకాశవాణి :

ఆకాశవాణి విజయవాడ హైదరాబాదు కేంద్రాలు విరివిగా, మద్రాసు కేంద్రం అరుదుగా తెలుగుసాహిత్యంలో వివిధ ప్రక్రియలను ప్రసారం చేస్తున్నాయి. ఈ ప్రసారాల నిమిత్తం నియతంగా రసమయి, సాహిత్యానందిని 'బుధవారపు నాటికలు' (ఇది ఆకాశవాణి వారు పెట్టిన పేరుకాదు. నియతంగా బుధవారంరాత్రి 8 గం॥ కు అరగంట కాలపరిమితిగా ఒకనాటిక ప్రసారం చేస్తున్నారు. కాబట్టి ఈ పేరు పెట్టవలసివచ్చింది.) మొదలైన కార్యక్రమాలు ఏర్పాటుగా ఉన్నాయి. ఇలా కాకుండా అప్పుడప్పుడు ధారావాహిక దత్త విషయాలపై గూడా రచయితలతో మాట్లాడించడం జరుగుతోంది. అల్లాంటి వాటిలో '- దృష్టిలో జీవితం ఆనందమయం' అనేది ఒకటి.

ఈ విషయం నిర్ణయించడంలో ఆకాశవాణి విజయవాడ కేంద్రంవారు (విజయవాడనుండే ఇవి ప్రసారమవుతున్నాయి.) ఏం ఊహించారో సరిగ్గా అర్థంకాదు. '-దృష్టిలో' జీవితం తప్పకుండా ఆనందమయమే అనా ? లేక ఈ దృష్టితో జీవితం ఆనందమయం, అల్లాకాకుంటే ఆనందమయ కాదు అనా ? కాక జీవితం ఆనందమయం అవునో కాదో రచయితలు చర్చించాలనా ? ...ప్రసారాలను బట్టి, ఎన్నుకొన్న రచయితలను జీవితం ఆనందమయమేనని నిరూపించమన్నట్టుగా తోస్తుంది. అసలు వారివారి దృష్టులలో కాకుండా రచయితలు ఆకాశవాణి వారి దృష్టిలో మాట్లాడమని కావచ్చు. అవును, తాము మాట్లాడమంటున్నారు కాబట్టి తమ ఇష్టంవచ్చినట్లు 'మాట్లాడటాన్ని' నియమించే అధికారం ఆకాశవాణివా రెల్లా వదులుకుంటారు ?

'సాహిత్యపరుని దృష్టిలో జీవితం ఆనందమయం' అని శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు 6-6-59 న మాట్లాడారు. మనచుట్టూఉన్న దృశ్యాలలో సర్వకాలాలందూ ఆనందమే దృశ్యమవుతున్నదని తమ 'ఋతుసంహారం' ఆధారంగా స్థిరీకరించారు. సాహిత్యపరులకది ఆనందాన్ని ఊహలో ఎల్లా చూడాలో తెల్పినట్టున్నది. చివరకు జీవితంలో ఆనందం కనబడకపోతే 'వాడంత దుఃఖవాడే' అని నిర్ణయించారు. అవును, ఆనందం కనుపించకపోతే వాడు - ఆ సాహిత్యపరుడు (అంతేఅయి ఉండాలి) - దుఃఖేగదా ! కనుపించకపోవడానికి వేరే కారణాలుండవచ్చు...శ్రీసత్యనారాయణగారు చదువగా పద్యాలు వినాలనుకొనేవారికి 'ఆకాశవాణి' ఒక అవకాశం కల్పించింది. అంతే.

ఇదే విషయంగూర్చి సంఘసేవకుని దృష్టిలో శ్రీగోపరాజు రామచంద్రరావుగారు 27-6-59 న మాట్లాడారు. శ్రోత ఈ సారి ఆకృష్టుడు కావడానికి కారణం ఈ సారి విషయం, ఊహకు ఉత్ప్రేక్షకు సంబంధించింది కాకపోవడం. సంఘసేవకు డెదుర్కోవలసిన పరిస్థితులు, అతడికి జీవితం ఎల్లా ఆనందమయం అవుతుందీ, కష్టాలుకూడా ఆనందంగా ఎల్లా మారటానికి వీలైనదీ అల్పకాల పరిధిలో పొల్లులేకుండా మాట్లాడడం జరిగింది.

ఇల్లాంటిదే మరో 'దత్తవిషయం', 'మహాభారత సర్వస్వం' అనేది. మాట్లాడవలసిన సమయం 15 నిమిషాలు మాత్రమే. మూడు మాటల్లో రామాయణగాథనంతా (కట్టె, కొట్టె, తెచ్చె) కుదించినట్టుగా విషయాన్ని అల్పీకరించాలని ఆకాశవాణి విజయవాడ వారి అభిప్రాయం కావచ్చు. వారిచ్చే విషయం చూస్తే అల్లాకుదించడానికి వీల్లేనిదీ, కుదించినా 'అంత' లాభం లేందీన్నూ. ఇతర సంగీతాది కార్యక్రమాలకూ, సినిమా శబ్ద చిత్ర ప్రసారాలకూ ఎక్కువ సమయాన్ని కేటాయించే ఆకాశవాణివారు ఇల్లాంటివాటికి సమయాన్నే కుదించడంలో అర్థంలేదు. ఎక్కువమందికి అవసరమయిందీ కార్యక్రమంకాదు అని వారు భావిస్తే ఈ మాత్రం సమయాన్ని కూడా ఏసినిమా పాటలకో, ఏ నిలయ వాద్య బృందానికో ఇవ్వడం మంచిది.... సరే, వారెదోవిధంగా ఇచ్చిందే చాలని

అనుకుంటే మాట్లాడేవారు నేరుగా విషయాన్ని వ్యక్తీకరించకుండా ఉపోద్ఘాతాలతో సమయాన్ని, ఆ కొంచెంపుణ్యకాలాన్ని వ్యర్థంచేయడం మరీ విపరీతం, ఈ దత్తవిషయంలో 'తాత్విక సమన్వయం' గూర్చి 18-6-59 న శ్రీ మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారి 'ఉపన్యాసం' అల్లానే జరిగింది. ఇందులో తాత్విక సమన్వయంతప్ప మిగతా భారతప్రశంస, కథా కథనం - అన్నీవున్నాయి. పెద్ద వ్యాసానికివలె మొదలై. అల్పకాలావధి కాబట్టి కటిక్కన ఆగిపోయింది. ఈ ఉపన్యాసంలో ఒక విచిత్రమైన ప్రతిపాదన జరిగింది. సునిశిత పరిశీలనద్వారా భగవద్గీత వ్యాసప్రోక్తం కాదని భారతాంతర్భాగం కాదని తెలుస్తోందంటూనే, భగవద్గీతే భారతోపదేశం, అదే మహాభారత సర్వస్వం అనడం ఎల్లా కుదిరిందో శ్రీ శాస్త్రిగారికే తెలియాలి.

మరి ఇదే విషయంలో 'మహాభారత మహాకావ్యం' గూర్చి 4-7-59 న శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మాట్లాడారు. ఒక్క సెకండు కూడా వ్యర్థం కాకపోవడం, విషయం నేరుగా చెప్పబడడం శ్రోతను బాగా ఆకర్షించింది...మహాభారతం మహాకావ్యం ఎందుకైంది? వ్యంగ్య ప్రధానం కావడంవల్ల...భగవద్గీతను భారతాంతర్భాగంగానే శ్రీ సత్యనారాయణగారు గుర్తించారు. అందువల్లే భారత ఆదిమధ్యాంతాల్లో శాంతరసం ప్రతిపాదితమై, వివిధ రసస్ఫోరకాలైన ఘట్టాలద్వారా ప్రధానరసం వ్యంజితమయిందన్నారు. విషయాన్ని స్ఫుటంగా, ప్రతిపాదించినవారు శ్రీ సత్యనారాయణగారు.

బుధవారపు నాటికల్లో ఒక మోస్తరుగా బాగున్నది 8-6-59 న ప్రసారమయిన శ్రీ శ్రీరంగం నారాయణబాబుగారి 'కాశ్యపి'అనే నాటిక. భూమి (కాశ్యపి) రైతుదే. దున్నేవానిదే భూమి అనే నినాదానికి ప్రచారంగా వ్రాయబడిందీ నాటిక. ఆ 'ప్రచారం' సరిగ్గానే నెరవేరింది. మతప్రతినిధి అయిన అర్చకపాత్రయొక్క కంఠధారి మాత్రం తన వాచికంతో ఆ పాత్రను హాస్యాస్పదం చేసాడు. 24-6-59 నాటి 'యస్యాస్తి విత్తం-' అనే శ్రీ కొడవటిగంటి కుటుంబరావుగారి నాటిక అరగంటలో ఒడుగలేదు. అందుకే నాటక సమాప్తి ఎల్లా అయిందో ఎందుకైందో అసలైందో కాలేదో కూడా తెలీదు. నాటిక పూర్తి అయిందనుకోవడానికి నేపథ్యంలో 'యస్యాస్తి విత్తం సనరః కులీనః-' అనే శ్లోకం చదివించారు. బహుశః ఆ శ్లోకం నాటిక కాధారం కావచ్చు కాని శ్లోకార్థానికి అనుగుణంగా నాటికలేదు. ఆశ్లోకం చదివించకుండా ఉంటేనే బావుండేది. అసలు చదువడం గూడా బాగాలేదు. 'కవి' కంఠధారి వాచికం బాగాలేదు. కవి అనగానే ఈ—ధారులు ఏమిచేత కానివాడనీ, మనసులో మాటలో ఏమాత్రం హుందా లేనివాడనీ అనుకునేట్టున్నారు, అది మాత్రం మార్చుకోవడం అవసరమని నాటక నిర్వాహకులూ—ధారులూ గమనించాలి. 1-7-59 నాటి 'ప్రతీకారం' అనే శ్రీ నార్ల చిరంజీవిగారి నాటిక, ప్రతీకారవాంఛ మంచిదికాదని నిరూపించడానికి వ్రాయడం జరిగినా, అదిమాత్రం నిరూపితం కాలేదు. బుద్ధబోధాసక్తుడైన యువరాజు ప్రతీకార వాంఛాసక్తుడు కావడమే అసంబద్ధం. ప్రతీకారవాంఛ విలువను (చెడ్డదని) తెలుసుకున్నానన్న యువరాజు మాటకు ఆధారం నాటికలో లేదు. ఎల్లా తెలుసుకొన్నాడో నిరూపింపబడలేదన్నమాట. మొత్తం 'బుధవారపు నాటిక'ల్లో చాలా బాగున్నది 8-7-59 నాటి శ్రీ గోరాశాస్త్రిగారి 'ఎదురుపరీక్ష' అనేది. 'మనస్తత్వం' ఆధారంగా సాగినఇది, జీవితంలో ఏదో పోగొట్టుకుని, ఓర్పు నశించి, హాయిలేకపోవడంవల్ల, ఇతరులను వక్రంగా (అది ఒకవేళ సత్యమే కావచ్చు.) వ్యాఖ్యానంచేసి తృప్తిపొందాలనుకొనే వారిని చిత్రిస్తుంది. 'తల్లి', 'రామారావు' కంఠధారుల వాచికం ఇతరుల దానిముందు తీసికట్టుగాఉంది.

బుధవారం నాటివి కాని కొన్ని నాటికల్లో 8-7-59 నాటి శ్రీమతి రమాదేవిగారి నాటికలాంటి ఊహాచిత్రం 'కరిగిపోయిన కల.' దాదాపు ఈ శీర్షిక తోనే రమాదేవిగారు ఒక పుస్తకం ఇదివరకే ప్రచురించారు. అదే దీని కాధారం. 'ఈ జీవితంలో ఏముందో తెలుసుకోవా లనుకొన్నంతకాలం ఈ కలలు తప్పవు. ఏదో ఉన్నదనుకోవడం కన్న ఏమీ లేదు. అంతా శూన్యం, అంతా భ్రమ' ఇవి ఊహా చిత్రంలో ఉపసంహార వాక్యాలు. అర్థం కాని అద్వైతాన్ని అర్థమైనట్టుగా భావించడం వల్ల ఉత్పన్నమైందీ ఊహాచిత్రం. ఉపసంహార వాక్యాలనీ—చిత్రం ఎల్లా స్పష్టపరిచిందో ఎంతకూ అర్థంకాదు. 'బోసి కుర్చి' మాట్లాడేతీరు కుదురలేదు. 'ప్రేయసి' బాగా మాట్లాడింది. తెగంటలు కొట్టినట్టున్న నేపథ్య సంగీతం ఎందుకో అర్థంకాదు. ఉన్నది కదా అని ఉపయోగించుకోవడానికి తప్ప...22-6-59నాడు శ్రీ నోరి నరసింహశాస్త్రిగారి 'రత్నాపహారం' నాటిక ప్రసారమైంది. వారి 'మల్లారెడ్డి' అనే నవలలో ఎర్రనను అన్నకు మల్లారెడ్డి దానం చేయడం అనే ఘట్టం ఆధారంగా సాగింది. ఏఒక్క కంఠధారీ సరిగ్గా వాచికం నిర్వహించలేదు. అక్కర లేని ఆవేదనలూ, అనవసరపు ఆవేశాలు వ్యక్తం చేసారు ఆ—ధారులు. సంస్కృత శ్లోక పఠనం దాని అర్థం తెలియకపోవడంవల్ల లోపవంతం అయింది. హైదరాబాదు నాటికా ప్రయోక్తలు శ్రద్ధవహించడం అవసరం.

'హాస్యవల్లరి' కార్యక్రమంలో 'సోమరులు' (18-6-59) 'సుపుత్రుడు' (20-6-59) కన్న 27-6-59 నాటి శ్రీ తురగా కృష్ణమోహన్ గారి 'నాటిక వింటారు' అనే నాటిక ఆ కార్యక్రమానికి తగినట్టుంది.

హైదరాబాదు కేంద్రంవారి 'నగరవాణి' లో 7-6-59న శ్రీ దాశరథిగారి 'తుంగభద్ర' నాటికలో ప్రత్యేకతలేదు. తుంగడు, భద్రావతి ప్రేమ గాథ. వారు నదీ ప్రవాహంలో మరణించడం వల్ల దానికా పేరు వచ్చింది. 'పగిలిపోవు రైక తొడిగినాను (చి) వెకిలినవ్వు నవ్వినాను' వంటి అసమయ జానపద గీతం బాగాలేదు. దానిలో కల్లా బాగుంది వర్షర్తుగేయం ఒకటే. ఇదే కార్యక్రమంలో 20-6-59 నాటి శ్రీ మాదిరాజు రంగారావు గారి 'దేవునితో టెలివిజన్ సంభాషణ' (25 శతాబ్దంలో) అనే స్వీయ కవిత చాలా బాగుంది. 27-6-59 నాటి 'తెలంగాణా' అనే దాశరథి. నారాయణరెడ్డి గార్ల నాటిక— అది నాటిక కాదు—ఆకర్షకంగా లేదు. ఏదో వరుస తప్పకూడదని రాసినట్టుంది. పోతన ఊర్ధ్వపుండ్రాలు ధరించాడనడం వీరి క్రొత్త ప్రతిపాదన. చారిత్రకులు గమనించాలి.

పోతే, 'సాహిత్య నందిని' కార్యక్రమంలో విజయవాడనుండి 16-6-59 న శ్రీమతి ఎస్. వి. సుశీలాదేవిగారు స్వీయకవిత వినిపించారు. పద్యాలు బాగా లేవు. ఫరవాలేదు అనుకొన్నా, పద్య పఠనం అయిదోతరగతి కుర్రాడు కొత్త పద్యాన్ని చూచి చదివినట్టున్నది. కనీసం అర్థస్ఫూర్తి కలిగించేట్టుగా నైనా లేదు. అనవసరపు దీర్ఘాలూ, ఆటంకాలైన విరుపులూ అతిబహుళం... ఈ కార్యక్రమంలోనే హైదరాబాదునుండి 30-6-59 న ప్రసారమైన శ్రీ మంజుశ్రీ గారి 'వానలో తడుస్తున్న మనిషి' అనే కథ చాలా బాగుంది. కరుణ రసాన్ని అంత చిన్న కథలో పొంగులుగాచిత్రించటం శ్రోతను బాగా ఆకర్షించింది. కథ చాలా ప్రత్యేకతతో ముగిసింది. ఆకథ వానలో తడుస్తున్న మనిషిని సంతుష్టంగా దుఃఖజీవిగా సాక్షాత్కరింప చేస్తుంది. రచయిత కొంచెం నెమ్మదిగా చదువుతే బాగుండుననిపించుతుంది.

'రసమయి' కార్యక్రమంలో 6-7-59 నాడు మద్రాసు నుండి ప్రసారమైన శ్రీ జలసూత్రం రుక్మిణీనాథ శాస్త్రిగారి 'ఏకవీర' (విశ్వనాథవారి నవల ఆధారంగా రచించిన ఏకపాత్రాభినయం) ఈమధ్య వచ్చినవాటిలో ఉత్తమంగా కుదిరింది. అంత నవలను 15 నిమిషాల్లో (విచార్యం) ఏక

పాత్రాభినయానుకూలంగా కుదిరించడంలో శ్రీ శాస్త్రిగారు నేర్పు చూపించారు. ఆ నవలకు ప్రాణ భూతమైంది అవ్వయ్యార్ (తమిళ కవయిత్రి) యొక్క 'అరుంజే విరుంబు' (ధర్మము చేయుము) అనే మాట. ఆ మాట ఏకవీరను నడుపుతుంది. అది ఈ క్లుప్తీకరణలో స్పష్టీకరించబడింది... అయితే ఒకటి— ఏకవీర మీనాక్షి ఇంటిలో వీరభూపతిని గుర్తించినట్లూ ఆ పైన్నే 'లొంగి' నట్లు శ్రీ శాస్త్రి గారు 'పలికించారు'. కాని నవల దృష్ట్యా తరువాత మీనాక్షి చెప్పేదాకా ఏకవీరకు అతడు వీరభూపతి, తన భర్త మిత్రుడనీ తెలియదు. అలా తెలిస్తే కథలో అందం దెబ్బతింటుంది. శ్రీ శాస్త్రిగారు గమనించ వలసింది. నేపథ్య సంగీతం చాలా అనుకూలంగా నిర్వహించబడింది. అభినేత్రి కమలాచంద్రబాబు వాచికాన్ని చాలా బాగా నిర్వహించారు.

ఆకాశవాణి అధికారులు విషయాలు నిర్ణయిం చడంలో, వాటికి సమయం కేటాయించడంలో, స్వీయకవితలు స్వీకరించడంలో, నాటికలు నిర్వ హించడంలో . శ్రద్ధ ముఖ్యంగా చూపటం అవసరం.

—సామీరి.

## సాహిత్యధార :

ఇతరుల మాట తెలియదు కాని ఈ తెలుగు సంపాదకుల విధులలో పత్రిక సరిగా అచ్చుపడునట్లు చూచుటకూడ ఒకటి. జయంతి జులై సంచికలో సుప్రసన్నగారి 'స్వావిష్కృతి' లోని సీసపద్యము ముక్కలు ముక్కలుగా చిత్రవధ చేయబడినది. నేను 'అభావము' అని వ్రాయగా అచ్చులో 'ఆ భావము' అని పడినది. మబ్బు అను శీర్షికలోని నాలుగవ పద్యములో ఒకచోట కొన్ని యక్షర ములు ముద్రారాక్షసుడు మ్రింగినాడు. చక్కగా అనుటకు బదులు గక్క.గా. ప్రతిభకు బదులు ప్రభాతి, శరీరం అనుటకు బదులు శరిం - ఇవి వాని తాండవభ్రమణ వేగమునకు చెల్లాచెదరై అస్తవ్య స్తములై తలక్రిందులైన కొన్ని పదముల దుర వస్థలు. ఇటువంటి వనేకములు.

ఒక్క జయంతిలోనే కాదు. తెలుగు పత్రికా లోకమునందిది సర్వసామాన్యమైన విషయము. బొత్తిగా తప్పైనను పరవాలేదు. చదువుకొనువా డేదో బాధపడి దిద్దుకొనగలవాడైనచో దిద్దు కొనును. లేనిచో వదలిపెట్టును. కాని శబ్దము తారుమారై దురర్థము నిచ్చునపు డున్నది బాధ యంతయు. ఒకసారి 'కుశగ్రహణము చేసి స్నానము చేసెను' అను వాక్యములో కుశగ్రహణమునకు బదులు 'కుచగ్రహణము' అని పడినదట. వది సమా సములతో వర్ణించినను పాప మా రచయితబాధ చెప్పబడ దనుకొందును.

సాహిత్య అకాడమివారిచే బహూకృతములైన గ్రంథములను గూర్చిన పరిచయము ప్రకటించు జయంతివారి ప్రయత్నము పశంసార్హము. అంత టితోఆగక అకాడమీవారికి సమర్పింపబడిన తెలుగు గ్రంథములనుకూడ బహూకృతములైన ఇతర భాషాగ్రంథములతోపోల్చి మంచిచెడ్డలు నిర్ణయించ వలసినదని నాసూచన. అక్కడకూడ ఆగక ఇది వరకు తెలుగులో బహుమానము వచ్చిన గ్రంథము లను ఇప్పుడు సమర్పించబడని గ్రంథములతోకూడ పోల్చి చూచినచో అకాడమీవారి చిత్తశుద్ధి, బహుమానములకు వారేర్పరచిన ప్రమాణములు, వానిని పాటించుటలు ఇవి కొంతవరకు లోకము నకు తెలియవచ్చును. తెలిసిమాత్ర మేమిలాభమని యడుగవచ్చును. అవును నిజమే. తుదకిది చెవిటి వానిముందు శంఖూదినట్లుకావచ్చును. ఈ చెవిటితన మొక సాహిత్యఅకాడమీ అధికారులది మాత్రమే కాదు. ఇటు సాహిత్య లోకమునందుకూడ ఆ

బాధిర్యము సమానముగానే యున్నది. లేనిచో ఐదారుగురు మహాశయులకు ఏపుస్తకమునకుకూడ బహుమానము రాకుండచేయు ధైర్యమెక్కడ నుండి వచ్చినది ?

అధికముగా అనుకరణ ప్రవృత్తి గలవారని ఒక విమర్శకునిచే యీసడింపబడిన సంపత్కుమార పద్యములు జూలై జయంతిలో (మబ్బు) ప్రకటింప బడినవి. భావములను కాపీకొట్టు అలవాటు ఈకవి కున్నట్లులేదు. మబ్బు నన్నివిధములుగా ఆయనయే చూచెను. అందులోని అక్షరాక్షరము ఆయనదే. కాని ఇంకొకరిదికాదు. ఇదివరకు ప్రకటింపబడిన ఆయన ఇతరకృతులకుకూడ ఈ మాటలు వర్తించును. మరి ఈ యనుకరణయన్న దెచ్చట ? శైలి యందా ? శైలి యన్నది వ్రాయ గలవాని సొమ్ము. కవికి తన భావముపై నున్న వైయక్తిక స్వామ్యము శైలిపై ఉండుటకు వీలులేదు. నా భావమును దొంగిలించినాడని చెప్పుటకు వీలున్నది. నాశైలిని దొంగిలించినాడని చెప్పుటకు వీలులేదు. ఇంతకు ఒక కవిముద్ర ఇంకొక కవిపై నుండుట వేరు. ఒకని నింకొక డనుకరించుట వేరు. గురుపదాధిష్ఠితుడైన వానిముద్ర తచ్ఛిష్యుల యందు, తదనుయాయుల యందుండుట పరమసహజము. ఒక సంపత్కుమార విశ్వనాథ సత్యనారాయణగారివలెనే పద్యము వ్రాసినాడన్నచో, ఒక రామకోటిశాస్త్రి కేవల మాయనవలెనే వాదించు నేమియన్నచో, ఒక సీతారామరావు విశ్వనాథ సత్యనారాయణగారే వ్రాసినారను భ్రాంతి కలుగువట్లు వ్రాసివాడన్నచో. అది యంతేయని సమాధానము. ఆయనవలె వ్రాయుచున్న, ఆయనవలె వాదించుచున్న ఈ రచయితలలో స్వీయమైన ప్రతిభ ప్రకాశించుచున్నదాలేదా యన్నది ప్రధానమైన ప్రశ్న. ఉన్నచో వారధికులు. లేనిచో వారల్పులు. ఈ ప్రధానవివక్ష తెలియనివారు శైలీసామ్యమును చూచి కలతజెంది అనుకరణ యని గోలచేయుట మొదలు పెట్టుదురు. ఊహలలో రచనలలో సామ్యము తత్తత్కవుల జీవలక్షణములోని సాధర్మ్యమునుబట్టి యేర్పడును. వట్టి బహిర్విషయమునుజూచి కవిత్వమునకు వెలలుగట్టువారికిది తెలిసికొనుట కష్టము. ప్రస్తుతమునకు వచ్చినచో సంపత్కుమార ప్రౌఢమార్గము లందుకొనుచున్న ప్రతిభాశాలి.

ఎంత చెప్పినను అభిజ్ఞాన శాకుంతల వ్యాసములను గూర్చిన ఆ ప్రశ్న కొందరిని పీడించుచునే యున్నది. ఇది యంతయు ఈ విమర్శకుని ఊహావైభవముకాని కాళిదాసింత ఆలోచించి వ్రాసినాడా యని. దానికి విశ్వనాథ సత్యనారాయణగారు మొదటి వ్యాసములోనే సమాధాన మొసగిరి. అయినప్పటికిని కొందరు ఆయన చెప్పినదానిని 'అతి' క్రింద త్రోసి తప్పుక పోవుచున్నారు. వారి కలంకార శాస్త్రము ప్రమాణము కావట. ఈ దేశములో పుట్టిన ఎవడు చెప్పినమాట కూడ వారికి ప్రమాణము కాకపోవచ్చును. అందుచేత ఇలియట్ మాట లుదాహరింపవలసి వచ్చుచున్నది. "ఒక కావ్యము భిన్నభిన్న పాఠకులకు భిన్నార్థముల నిచ్చునదై యుండవచ్చును. తుదకీ యర్థములన్నియును కవి తానుద్దేశించినాననుకొన్న యర్థముకన్న భిన్నములు కావచ్చును...పాఠకుని వ్యాఖ్యానము కవి చేయు వ్యాఖ్యానముకంటె భిన్నమైనదైకూడ అంతే సమంజసమైనది కావచ్చును. అంతకన్న ఎక్కువ సమంజసమైనదికూడ కావచ్చును. కవికి తెలిసినవానికంటె అధిక విషయములెన్నో ఆకావ్యమునం దిమిడి యుండవచ్చును ... ... (టి. యస్. ఇలియట్. సెలెక్టెడ్ ప్రోజ్. పెంగ్విన్ బుక్స్. పుటలు 57, 58.)

వేగముగా పరిభ్రమించు వస్తువులయొక్క చలనమునం దీర్ష్యవహించిన యొకానొక యువతి యొక్క విచిత్ర మనఃప్రవృత్తి చిత్రించుటలో బుచ్చిబాబుగారు సఫలులైనారు. (బీ. జయంతి జూలై) తిరుగుచున్న విమానము రెక్కలుపట్టుకొని శరీరఖండము లేర్పరుపరానంతగా ముక్కలు

ముక్కలైపోవుట అసహజముగా నున్నది కాని అపాత్రనట్లూహించి అట్లునిర్వహించుట మిక్కిలి సమర్థతతో గూడుకొనిన కార్యము. గురజాడ అప్పారావుగారిని గురించి ఇక చెప్పవలసినదేమియు లేదు. విశ్వనాథరావుగారు (జయంతి 9) తమ వ్యాసములో 'కోకిల కొమ్మలో' అను దానికి 'గంగాయాం ఘోషః' వలె లక్షణార్థము చెప్ప వలయునన్నారు. లక్షణార్థప్రసక్తి లేకున్నను 'కోకిలకొమ్మలో' సమంజసమే. ఎందుకనగా కోకిల కూయుచున్నప్పుడు కనపడదు. లక్షణచెప్పుకొనుట కన్న ఇట్లుచెప్పుకొనుటయే ఉత్తమము.

సీరియల్ నవల 'అన్వేషణ' కొంత దారిలో బడినది. కొంత మనస్సును బట్టుకొనుచున్నది. కథ రెండుగా చీలినది. ఒక చీలిక యొకమార్గములో ఇంకొకటి ఇంకొకమార్గములో నడచుచున్నది. ఈ రెండు చీలికలను చివరకు మలచిన మలపులో రచయిత సామర్థ్యము వెల్లడియగును. వర్ణనలలో ప్రాణములేదు.

ఆంధ్ర పత్రికలో ప్రకటింపబడిన కథలలో సి. రామచంద్రరావుగారి ఏనుగులరాయి పేర్కొన దగినది. 24-6-59.) ఒక యాటవికుని ఆర్ద్రమనో వృత్తి ఈ కథలో చక్కగా చిత్రింపబడినది. గొప్పోళ్ళ బతుకులు (అరిగే రామారావు. 8-7-59) వంటి కథలు సహస్రములు వెలువడినవి. ఒక పని చేయుటకు పోయి చివరకు దాని యందు వైముఖ్యము వహించుట, జమీందారు, బ్రాండీ, మానభంగము - వట్టి చర్వితచర్వణము.

ఎందుకో తెలియదుకాని కొందరు కొందరు కథ లలో కొన్ని ఇంగ్లీషు శబ్దములు వాడుదురు. 'ఫాల్స్ ప్రిస్టేజ్' (శాతినేని:- ఆంధ్రపత్రిక 24-6-59) 'ఫ్రెండ్లు, డ్యూటీ, ఫినిష్, ట్రై, నండూరి సత్యనారాయణరావు ఆంధ్రపత్రిక 24-6-59) ఇది వట్టి హాస్య మనోవృత్తి. ఉచ్చా రణ కూడ తెలియని ఇంగ్లీషుశబ్దములను ప్రయో గింపజూచుట మరియు ఘోరము.

భారతిలో సాళ్వ కృష్ణమూర్తిగారు (అనంత కృష్ణులు, అభిరుచి నిర్దేశము) కూడ అవసరమున్న చోట లేనిచోట తెలుగుశబ్దములకు సమానార్థకము లైన ఇంగ్లీషుశబ్దములను వ్రాసినారు. చిత్తవృత్తి, సౌమనస్యవైమనస్యములు, ప్రేరణ, ఉద్రేకము, పదార్థము ఇవి తెలుగుపాఠకులకు చక్కగా అర్థ మగుశబ్దములు. ఇవి చూచినపుడు సంపాదకులు వ్యాసకర్తల వ్యాసములు సరిగా చదువరేమో యన్న సందేహము కలుగక మానదు. కొన్ని ఇంగ్లీషు వాక్యములు యథాతథముగా నుదహ రించినారు. ఇవి ఇంగ్లీషురాని పాఠకులకు సూదులు గ్రుచ్చినంత బాధకలిగించుచున్నవనుటలో సందే హములేదు ఆవాక్యముల సారాంశము తెలుగులో హాయిగా వ్రాయవచ్చును. ఏ ఇంగ్లీషువాడును మరొకడును, తెలుగులోని వాక్యముల నుదాహ రించవలసి వచ్చినపుడు వానిని యథాతథముగా తెలుగు లిపిలో నుదాహరించడు.

ఈ నెల భారతిలో పరిశోధనకు సంబంధించిన వ్యాసము లెక్కువ యున్నవి. చైనా ఆర్థికవ్యవస్థ, వార్తలు మొదలైనవి అనవసరములు. ఈ విషయ ములను గురించి తట్టలకొద్ది విషయము అన్యత్ర వ్రాయబడుచునే యున్నది.

పుస్తక సమీక్షలలో బూర్గుల రామకృష్ణరావు గారి పుస్తకమును గూర్చినదానికన్న వారి వ్యక్తిని గూర్చిన పొగడ్త ఎక్కువగా యున్నది. అన్నయ మంత్రి, కృష్ణరాయలు ఈ మాటలు సమీక్షకుని స్తోత్రము చేయు సామర్థ్యమును సూచించును గాని రామకృష్ణారావుగారిని కృష్ణరాయలను చేయవు. అధికారములో నున్నవానిని స్తోత్రము చేయుటకూడ తెలుగువారి విమర్శలో ఒక భాగము కావచ్చును.

వసంతరావు రామకృష్ణరావుగారి 'గడచిన రోజులు' అన్న ఖండిక స్వతంత్ర 18 జులై సంచి కలో ప్రకటింపబడినది, 'రోచిర్మృగవులు' 'దుఃఖ



తరళలు' మొదలైన ప్రయోగములు ఈ గేయము నందలి ప్రత్యేకతలు.

ఇదే సంచికలో శ్రీ పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'సురభినాటక సమాజములు' ప్రకటింప బడినది. ఈ నాటకసమాజ మెప్పుడు స్థాపింపబడి నదో ఎవరెవ్వుడు పుట్టినారో, నాటక మే సంవత్సరములో ప్రదర్శింప బడినదో వానిని గురించిన వివరములు ఈ వ్యాసములో దొరుకును.

స్రవంతి జులై సంచికలో దాశరథి గారి పద్యములు(యువత)ప్రకటింపబడినవి. స్వతంత్ర 11జులై సంచికలో దేవులపల్లి కృష్ణశాస్త్రి గారి గేయము ప్రకటింపబడినది.

కుట్రలేని మనసు. కుత్సిత మ్మెరుగని
యెడదలోన యువత ఇవతరించు
తెల్లబడిన కురుల నల్లని వర్ణమ్ము
వైచినంత యువత వచ్చిపడునె—*దాశరథి*

తేలు కుడుతుంది, తో
డేలు హింసిస్తుంది
తీతు వెవ్వరినైన తిడుతుంది —*కృష్ణశాస్త్రి*

ఆంధ్ర ప్రజల కాశాజ్యోతిగా బయలుదేరిన దాశరథి కవిత్వమేనా యిది? బ్రహ్మ వ్రాతలో వ్యాకరణమ్ము లేదు, శివుని కంటిలో పిడుగులు పిల్లలు పెట్టుకొన్నవి, అనగలిగిన దాశరథి తన కవిత్వమునకు వేమనత్వమాపాదింపజూచుట విచారకరము. మాధుర్య గుణమును పలుకులు పలికించిన కృష్ణశాస్త్రిగారీ స్థితికి దిగజారుట మరీ కష్టము కలిగించు విషయము.

అభ్యుదయ రాలేదు.

నవభారతి రాలేదు. ఈ పత్రిక మూలమున ఎవరైన సంస్కృతము, నాట్యశాస్త్రము, ఉపనిషత్తులు, వేదాంత పంచదశి, అర్థశాస్త్రము, తర్కసంగ్రహము నేర్చుకొనువారున్నచో వారికి మిక్కలి కష్టము కలుగుచుండవచ్చును. పత్రిక వచ్చునాటికి ఫల మనుభవింపబడును గనుక మాస ఫలములకై ఎదురుచూచువారు కష్టపడియు లాభములేదు.

చివరకొక చిన్న సమాధానము. ఎవ డేమి వ్రాసికొన్నచో నీకేమి? విశ్వవిద్యాల యాచార్యుల జ్ఞానముతో నీకేమి సంబంధము? అని ప్రశ్న పరంపరలు గురియుచున్నవి. ఎవరి యిష్టమువచ్చినది వారు వ్రాసికొనవచ్చును. తమ తలగడక్రింద పెట్టుకొని నిద్రించవచ్చును. నేను మాటాడునదిలేదు. పత్రికలో ప్రచురించుట యన్నంతనే వ్యవహారము మారుచున్నది. చాలమందిమందభాగ్యులుడబ్బుపెట్టి పత్రికలుకొనుచున్నారు. కొన్ని వందలమంది దగ్గర డబ్బు వసూలుచేసి సంపాదకులీ పత్రికా వ్యవహారము సాగించుచున్నారు. పత్రికలో మీ వ్యాసము ప్రకటింపబడినదనగా పాఠకునికి దానిపై కొంత యధికార మేర్పడినదని యర్థము. ఇక విశ్వవిద్యాలయముల మాట చెప్పవలసిన యవసరములేదు. యువ రచయితల సాహిత్య సృష్టికి, విశ్వవిద్యాలయములందలి విద్యాబోధకు దగ్గరి సంబంధమున్నది విశ్వవిద్యాలయములు నడుపబడుచున్నవి మా డబ్బుతో- మూడుకోట్ల మంది డబ్బుతో. లక్షల కొలది జనుల మనోవాంఛలను తన కవిత్వములో సువ్యక్తముచేసిన ఆ విపరీతప్రతిభాశాలి యన్నాడు కదా—

వ్యక్తుల పైరివేటు బ్రతుకు వారి వారి స్వంతం,
పబ్లికుగా నిలబడితే ఏమైనా అంటాం-టాంటాం.

—నమవర్తి

లక్షలకొలది భారతీయుల కొఱకు మంచి సిగరెట్లు

చౌకగా

# ది హింద్ టుబాకో అండ్ సిగరెట్ కం. లిమిటెడ్

హైదరాబాదు-ద. వారు

తయారుచేయుచున్నారు.

* అజంతా
* ఎల్లోరా
* ఓల్డుఫెలో

స్ఫూర్తిదాయకాలైన ఈ సిగరెట్లు
ఆరోగ్యపూర్ణ వాతావరణములో
ఆధునిక యంత్రములలో నిర్మింపబడినవి.

విశేషజ్ఞులచేత నిర్ణయింపబడిన పొగాకు.

ఏర్‌కండిషండ్ గోదాములలో ఉంచుటచేత ఈ సిగరెట్లు ఎప్పుడూ తాజాగా ఉంటవి.

## వచ్చే సంచికలో

మంజుశ్రీ

గోపాలచక్రవర్తి

తుమ్మలపల్లి రామలింగేశ్వరరావు

ఖులుసు జీ. ప్రకాశ్

రమాకాంత్

సుప్రసన్న

విశ్వనాథ సత్యనారాయణ

516, సుల్తాన్ బజార్, హైదరాబాదునుండి జువ్వాది గౌతమరావుచే ప్రకటితము. ఫోన్ : 4616
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.